● ఇన్సూరెన్స్ జాతీయకరణ దినోత్సవం ● ఇ.పి.ఎఫ్.వడ్డీరేటు 12%కి పెంచాలి



# కార్మికలోకం

సెప్టెంబర్ 2004 మాస పత్రిక వెల రూ : 5

విద్యుత్ అమరవీరుల స్మృతి చిహ్నం

















'కృష్ణ' పుష్కరాల ప్రత్యేక సంచిక

కృష్ణ పుష్కర శుభాకాంక్షలతో ....

# అభివృద్ధి పథంలో గద్వాల్ మున్సిపాలిటి


**డి.కె.అరుణ**
గద్వాల ఎం.ఎల్.ఏ.


**అక్కల రమాసాయిబాబ**
మున్సిపల్ ఛైర్‌పర్సన్


**నర్సిములు**
మున్సిపల్ వైస్ ఛైర్మన్


**ఎం.ఎ.అలీం**
మున్సిపల్ కమీషనర్

## 2000-2004 సం॥ల అభివృద్ధి పనులు

1) **యన్.యస్.డి.పి.నిధులు :** రూ. 147 లక్షల విలువైన డ్రైన్లు, రోడ్లు మరియు ఇతర పనులు చేపట్టబడి రూ. 77 లక్షల విలువైన పనులు పూర్తిగావించనైనవి. మిగతా పనులు ప్రోగ్రెస్ నందు వున్నవి.

2) **యస్.జె.యస్.ఆర్.వై. నిధులు :** రూ. 18.25 లక్షల విలువైన రోడ్లు మరియు ని'సేవా కేంద్ర భవన నిర్మాణము వని చేవట్టబడి కొన్ని వనులు పూర్తిగావించనైనవి. మిగతా పనులు ప్రోగ్రెస్‌నందు వున్నవి.

3) **ఇ' సేవా కేంద్రము :** రూ.10.00 లక్షల విలువచే 'ఇ' సేవా కేంద్ర భవన నిర్మాణము పూర్తిగావించనైనది.

4) **మున్సిపల్ కార్యాలయ నూతన భవన నిర్మాణము నిధులు :** రూ.30.00 లక్షల విలువ చేసే మున్సిపల్ కార్యాలయ నూతన భవన నిర్మాణమునకు మంజూరికాగా ఇట్టి పని ప్రారంభించవవలసి వున్నది.

5) **కరువు నిధులు :** రూ.26.63 లక్షల విలువైన నీటి సరఫరా పనులు చేపట్టబడి పూర్తిగావించనైనది.

6) **ఇ.ఐ.యు.యస్.నిధులు :** రూ.17.60 లక్షల విలువైన రోడ్లు, డ్రైన్లు చేపట్టబడి రూ. 4.10 లక్షల విలువైన పనులు పూర్తి గావించనైనది. మిగతా పనులు ప్రోగ్రెస్ నందు వున్నవి.

7) **రోడ్డు గ్రాంటు నిధులు :** రూ. 9.28 లక్షల విలువైన రోడ్డు పనులు చేపట్టబడి పూర్తిగావించినైనవి.

8) **యం.పి.యల్.ఎ.డి.యస్.నిధులు :** రూ. యం.పి.ల్యాడ్స్ క్రింద (లోకసభ మరియు రాజ్యసభ) సభ్యులచే రూ.65.00 లక్షలు మంజూరి కాబడగా (16) సి.సి.రోడ్లు, (14) కమ్యూనిటిహాల్సు, స్టేడియం మరియు దోభిఘాట్ నిర్మాణము పనులు చేపట్టబడి పూర్తిగావించనైనవి.

9) **ఐ.డి.యస్.యం.టి. :** ఐ.డి.యస్.యం.టి. పథకము క్రింద రూ. 136.53 లక్షలతో (107) షాపుల నిర్మాణము వని చేవట్టబడినది. ఇట్టి వనులు పూర్తిగావించవలసి వున్నవి.

10) **సి.యం.అస్యూరెన్సు నిధులు :** రూ.35.00 లక్షల విలువచే డ్రైన్లు పనులు చేపట్టబడినవి.

11) **కృష్ణా పుష్కరం నిధులు :** కృష్ణా పుష్కరములు 2004 ననుసరించి గద్వాల మున్సిపాలిటికి రూ.2-00 కోట్లు మంజూరి కాగా ఈ క్రింది పనులు చేపట్టుటకు శ్రీయుత జిల్లా కలెక్టరు మహబూబ్‌నగర్ గారు పరిపాలనా యోగమాగావించినారు. పనులు ప్రారంభముకావలసివున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1) | శ్యానిటేషన్ నిమిత్తము | - | రూ. 90,000/- |
| 2) | గార్బేజ్ లిఫ్టింగ్ ఛార్జిలు | - | రూ. 1,50,000/- |
| 3) | బ్లీచింగ్ పౌడరు కొనుగోలుకు | - | రూ. 52,000/- |
| 4) | చున్నము కొనుగోలుకు | - | రూ. 28,800/- |
| 5) | ఫినాయిల్ కొనుగోలుకు | - | రూ. 40,000/- |
| 6) | ఫాగింగ్ మెషిన్ కొనుగోలు మరియు లిక్విడ్ కొనుగోలునకు | - | రూ. 70,000/- |
| 7) | శ్యానిటరి పరికరముల కొనుగోలునకు | - | రూ. 60,000/- |
| 8) | డస్ట్‌బిన్స్ కొనుగోలుకు | - | రూ. 1,00,000/- |
| 9) | సైకిల్ రిక్షా విల్ బకెట్స్ కొనుగోలుకు | - | రూ. 20,000/- |
| 10) | జంగిల్ కటింగ్ నిమిత్తము | - | రూ. 15,000/- |
| 11) | నీటి సరఫరా కొరకు వాటర్ ట్యాంకర్ల కిరాయి ఇతరములు | - | రూ. 1,60,000/- |
| 12) | మూత్రశాలలు ఏర్పాటునకు | - | రూ. 50,000/- |
| 13) | మరుగుదొడ్ల నిర్మాణమునకు | - | రూ. 60,000/- |
| 14) | బ్యూటిఫికేషన్ కొరకు<br>ఎ) ఐల్యాండులందు గ్రిల్స్ ఏర్పాటు<br>బి) అన్ని దేవాలయములు మరియు సర్కిల్స్ లందు లైటింగ్ ఏర్పాట్లు | - | రూ. 7,50,000/- |
| 15) | వీధి లైట్లు ఏర్పాటునకు<br>ఎ) సెంట్రల్ లైటింగ్ - 60.00 లక్షలు<br>బి) హైమాస్ట్ లైటింగ్ - 20.00 లక్షలు<br>80.00 లక్షలు | - | రూ. 80,00,000/- |
| 16) | పట్టణమునందు వివిధ ఏరియా లందు సిసి మరియు బి.టి.రోడ్లు వేయుట మరియు డ్రైన్స్ నిర్మాణము | - | రూ. 90,56,800/- |
| 17) | అత్యవసరముగా చేపట్టు వలసిన పనుల నిమిత్తము | - | రూ. 12,97,400/- |

12) **సిటి ఛాలెంజ్ ఫండు :** సిటి ఛాలెంజ్ ఫండు క్రింద గద్వాల మున్సిపాల్టికి రూ. 5.00 కోట్లు మంజూరి కాబడినవి. ఇట్టి మంజూరైన నిధుల నుండి చేపట్టవలసిన అభివృద్ధి పనులను వర్షాకాలము తర్వాత చేపట్టుటకు ఆదేశించినందున ఇట్టి పనులు వర్షాకాలము తర్వాత ప్రారంభించబడును.

## గద్వాల మున్సిపల్ కౌన్సిలర్స్

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1వ వార్డు | బంగి లక్ష్మణ్ | 9వ వార్డు | వై.శ్రీనివాస్ | 17వ వార్డు | విజయ్‌కుమార్ | | |
| 2వ వార్డు | శంకర్ | 10వ వార్డు | బి.ఎస్.కేశవ్ | 18వ వార్డు | జి.శివకుమార్ | | |
| 3వ వార్డు | సరస్వతి | 11వ వార్డు | సూరమ్మ | 19వ వార్డు | జయశ్రీ | | **కో-ఆప్షన్ మెంబర్స్** |
| 4వ వార్డు | ఎస్.శేఖర్ | 12వ వార్డు | విజయలక్ష్మి | 20వ వార్డు | ఎం.ఎన్.నర్సిములు | 1) | జానకి రాములు |
| 5వ వార్డు | ఎన్.జ్యోతి | 13వ వార్డు | జయమ్మ | 21వ వార్డు | అక్బరీ బేగం | 2) | మహిమూద్ |
| 6వ వార్డు | టి.రామాంజనేయులు | 14వ వార్డు | వెంకటమ్మ | 22వ వార్డు | కె.వెంకటస్వామి | 3) | సత్యవాణి |
| 7వ వార్డు | క్రిష్ణసాగర్ రెడ్డి | 15వ వార్డు | నర్సిములు (వైస్‌ఛైర్మన్) | 23వ వార్డు | కె.ఎల్లప్ప | | |
| 8వ వార్డు | సి.ప్రభాకర్ | 16వ వార్డు | లుతూఫ్ అలీఖాన్ | 24వ వార్డు | ఎం.డి.ముమీన్ | | |

# కృష్ణా పుష్కరాలు 2004















కృష్ణా పుష్కర శుభాకాంక్షలతో ....



శ్రీ డా॥ వై.ఎస్.రాజశేఖర రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి

**చిట్టెం నర్సిరెడ్డి,**
ఎం.ఎల్.ఏ. గారికి
**75వ జన్మదిన శుభాకాంక్షలు**



శ్రీ చిట్టెం నర్సిరెడ్డి
ఎం.ఎల్.ఏ., మఖ్తర్

## అభివృద్ధి పనులు

1) రూ॥ 25 వేలతో పోలీసు స్టేషన్ వరకు గ్రావెలింగ్-మొరం వేయడం.
2) రూ॥ 25 వేలతో తంగిడిగి పాఠశాల భవనం రిపేర్.
3) రూ॥ 4 లక్షలతో తంగిడిగిలో సి.సి.రోడ్డు, సైడ్ డ్రైన్స్ నిర్మాణం.
4) రూ॥ 2 లక్షలతో గుర్జాలలో సి.సి.రోడ్డు నిర్మాణం.
5) రూ॥ 11.50 లక్షలతో పుష్కరాలకై గ్రావెలింగ్, మొరం, సైడ్‌డ్రైన్స్, జంగిల్ కటింగ్ పనులు కృష్ణా గ్రామంలో.
6) రూ॥ 2 లక్షలు క్రిష్ణా గ్రామంలో సి.సి.రోడ్డు నిర్మాణంకై నిధులు మంజూరు.



గుండూరావ్ కులకర్ణి
ఎం.పి.టి.సి.
తంగిడిగి - గ్రామం



ఎక్బాల్ భాష
మండల కోఆప్షన్ మెంబర్
క్రిష్ణా - గ్రామం



చెన్నప్పగౌడ్
కాంగ్రెస్ నాయకులు
గుర్జాల గ్రామం

**మాగనూర్ మండలం, మఖ్తల్ నియోజకవర్గం.**

# సెప్టెంబర్ - 2004

# కార్మికలోకం

సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ కమిటీ మాసపత్రిక

సంపుటి 20 సంచిక 9

విడి ప్రతి వెల : రూ. 5

సం॥ర చందా : రూ. 50


## విషయ సూచిక




మేనేజర్

కార్మికలోకం

యన్.వి.బి. స్మారక కేంద్రం, 1-1-60/4,

ఆర్టీసీ క్రాస్ రోడ్స్, ముషీరాబాద్, హైదరాబాద్ - 20.

ఫోన్ : 7624502, 7612474

ఫ్యాక్స్ : 7610128




**సంపాదకీయం**

## క్రొత్త ప్రభుత్వాలు-పాత బాట వీడాలి!

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 100 రోజులపాలన పూర్తి చేసుకున్నాయి.

ఓ సినిమా 100 రోజులు ఆడితే అది హిట్. లేకుంటే ఫ్లాప్. హిట్ అయితే సదరు హీరో వీరాభిమానుల ఆనందానికి అవధులుండవు. శతజయంతి వేడుకలు ఉత్సాహంగా ఘనంగా జరిపేస్తారు. బాక్సాఫీసు ఫలితాలు కొలిచేందుకు 100 రోజులు కొలబద్ద చాలు సినిమాకు.

100 రోజులు దాటిన క్రొత్త ప్రభుత్వాల పాలన హిట్టా? 'ఫ్లాప్' అయ్యిందా? ... ఒక నిర్ధారణకు రాలేము. 60 మాసాలలో పూర్తి చేయవలసిన వాగ్దానాలను 100 రోజులలో చేయలేదన్న నిరాశ సమంజసం కానేరదు. పార్లమెంటు వగైరా అధికారపీఠాలపై కుదురుకోకుండానే స్వల్పకాల పాలన పై తీర్పు చెప్పడం అసంబద్ధం.

ఊరికళ... ఊరిముందు గొడలే చెబుతాయన్నది ఆచరణ నుండి పుట్టిన నానుడి. క్రొత్త ప్రభుత్వాల పథనిర్దేశాలు, విధాన నిర్ణయాలు, పాలనా పద్ధతులు వాటి పనితనానికి సూచికలు. ప్రభుత్వాల పట్ల ప్రజలలో ఉత్సాహ- నిరుత్సహాలకు; ఆశలు-అసంతృప్తులకు పై అంశాలు ప్రభావం చూపుతాయనడంలో సందేహం లేదు.

ఊహించిన దానికంటే వేగంగా క్రొత్త పాలకులపై అసంతృప్తి పెరుగుతున్నది. "సంస్కరణల బాట వీడం" అనే పాలకుల ఆలాపన. ఆ దిశలో సాగిన చర్యలు ఉద్యోగులను, కార్మికులను కలవర పరుస్తున్నాయి.

ఆగష్టు మాసంలోనే ప్రజలు ఉద్యమించాల్సిన పరిస్థితిని ప్రభుత్వాలు అనివార్యం చేశాయి. పెట్రోల్,డీజిల్ ధరల పెంపు వారిని కలవర పరుస్తున్నది. అగష్టు 20న కేంద్ర కార్మిక సంఘాలు, స్వతంత్ర ఫెడరేషన్ల నేతృత్వంలో దేశవ్యాపితంగా నిరసన దినం పాటించారు. ఆగష్టు 24న బ్యాంకింగ్ రంగంలోని అన్ని ఉద్యోగ యూనియన్లు కలిసి ఒక రోజు టోకెన్ సమ్మె నిర్వహించారు. ఇన్సూరెన్స్ రంగంలో జరుగుతున్న నిరంతర ఆందోళనలు మనకు తెలుసు. టెలీకం లోనూ పలు ఆందోళనలకు పిలుపులు ఇవ్వబడ్డాయి. బొంబాయి,ఢిల్లీ విమానాశ్రయాల ప్రైవేటీకరణ ప్రతిపాదనలను ఆ రంగంలోని ఉద్యోగుల, కార్మికులనుండి బలమైన ప్రతిఘటన ఎదురయ్యింది.

రాష్ట్రంలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల కార్మికులు ప్రదర్శనలు, పికెటింగులతో వీధుల కెక్కవలసి వచ్చింది. ఉచిత విద్యుత్ అంశంపై అనధికార కనెక్షన్ దారులపై పోలీసు కేసులు పెడతామన్న ప్రభుత్వ ప్రకటన పులిమీద పుట్రలా వచ్చిపడింది. ఇద్దరు రైతుల ఆత్మ హత్యలకు దారితీయడం దురదృష్టకరం.

వామపక్షాల నిరంతర వత్తిడి, ఆందోళనల వల్ల మాత్రమే ప్రజా వ్యతిరేక విధానాలు ఒక మేరకు అదుపులో వున్నాయి. ఇ.పి.ఎఫ్. వడ్డీ రేటును 8.5 శాతంకు తగ్గించాలన్న ప్రతిపాదనలు పున: పరిశీలించడానికి కేంద్రం అంగీకరించింది. పెట్రోల్, డీజిల్ పై కొంతమేర పన్నులు తగ్గి, ధరల వేగానికి బ్రేకు పడింది. విదేశీ పెట్టుబడుల విషయంలో తొందర పడబోమని హామీ లభించటం తాత్కాలిక ఉపశమనం.

ప్రధానప్రతిపక్షం ఎన్‌డిఎ ముఖ్యంగా బిజెపి ప్రజాసమస్యలు గాలికొదిలేసింది. కళంకిత మంత్రుల తొలగింపు, ఉమాభారతి- జాతీయ పతాకం, సావర్కర్, ఆర్ఎస్ఎస్, గాంధీహత్య వగైరా అంశాలపై 3నెల్లుగా పార్లమెంటునుస్తంభింప చేయడం ప్రమాదకరం. ఇందుకు పాలక కాంగ్రెస్‌లోని కొందరు నాయకులు అవకాశం ఇవ్వడం దురదృష్టకరం.

పాలక యుపిఎ సంఘపరివార్ శక్తులు ఛాలెంజ్‌ను స్వీకరించాలి. ఈ పోరాటంలో వామపక్షాలు, అభ్యుదయ శక్తులు, మేధావుల సాయం తీసుకోవాలి. ప్రజలలో సంఘపరివారం ఎత్తుగడలను ఎండగట్టాలి.

యుపిఎ ప్రభుత్వం ప్రజల విశ్వాసం పొందాలి. ఆర్థిక విషయాలలో బిజెపి విధానాలను విడనాడాలి. ప్రజలకు ఉపకరించే ప్రత్యామ్నాయ ఆర్థిక విధానాలు అమలు జరపాలి.

ఈ కర్తవ్యంలో విఫలమైతే మతోన్మాద శక్తులు మరలా పుంజుకుంటాయి. తద్వారా జరిగే నష్టాలకు కాంగ్రెస్ పార్టీయే బాధ్యత వహించాలి. ప్రజల సంక్షేమం, ఎన్నికల వాగ్దానాలు, సిఎంపిలను మరచి పాత విధానాలనే అమలు పరిస్తే కాంగ్రెస్ ప్రభుత్వానికి పుట్టగతులుండవు.

# కార్టూ సమయం

వివిధ పత్రికల సౌజన్యంతో






దీన్ని 'చావుకు మద్యం' అనరయ్యా బాబూ, 'చౌకమద్యం' అంటారు...!









ఆ లెక్కన ఈ గవర్నమెంటు ఐదేళ్ళకాలం ముగిసే నాటికి పదేళ్ళలో తెలంగాణ ఖాయమంటారా సార్?

# కృష్ణ పుష్కరాలు



దక్షిణ భారతదేశంలో గోదావరి, కృష్ణ అత్యంత ప్రాధాన్యత కల్గిన నదులు. ఈ రెండు నదులూ పడమటి కనుమలలో (సహ్యాద్రి పర్వత శ్రేణుల్లో) పుట్టినవే. కృష్ణమ్మ మహాబలేశ్వరంలో ముద్ర మట్టానికి 4383 అడుగుల ఎత్తులో పుట్టి రవళ్ళ పరవళ్ళతో పారి తన ప్రియ సఖులైన ఉపనదులెన్నింటినో తనలో లీనం చేసుకుంటూ మహారాష్ట్ర నుండి కర్నాటక ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించి తుదకు బంగాళాఖాతంలో కలుస్తుంది.



అమరావతి శిల్పము

మనుష్యులు, జంతువులు, పక్షులు సమస్త జీవరాశికి జలమే ఆధారం. నదీ పరీవాహక ప్రాంతాలే ఆది నుండీ మానవ నివాసాలుగా ఉండేవి. అందుకే మానవ నాగరికత నదుల చుట్టూ తిరుగుతూ అవినాభావ సంబంధం కలిగివుంది. ఆధునిక కాలంలో కూడా వ్యవసాయానికి, రవాణా సదుపాయాలకు, మత్స్య సంపదకు, విద్యుదుత్పత్తికి, పరిశ్రమలకు నదులు ప్రధాన వనరులుగా ఉంటున్నాయి.

అందువల్ల ప్రజలు ప్రతిదేశంలోనూ తమకు అత్యంత ప్రీతిపాత్రమైన నదులను కృతజ్ఞతా భావంతో దైవ స్వరూపంగా ఆరాధిస్తూ వస్తున్నారు. ఈ భావమే అనేక పురాణ గాథలకు, కథలకు, ఆచారాలకు ప్రాతిపదికగా ఉన్నది.

## కృష్ణానదిని గురించి

నదినాం సాగరో గతిహిః (అంటే ఏ నదైనా ఆఖరికి ఉప్పు సముద్రంలో కలవల్సిందే అని భావం). కానీ కృష్ణమ్మకు ఈ నానుడి మక్కికి మక్కి వర్తించదు. ఇబ్బడిముబ్బడిగా ప్రాజెక్టులు కట్టడంతో నదిలో నీళ్ళు ఏ మూలకూ చాలటం లేదు. అందువలన నీటికోసం రాష్ట్రాల మధ్య పెనుతగాదాలకు కూడా దారి తీస్తోంది. ఆలమట్టి, నారాయణపూర్, జూరాల, శ్రీశైలం, నాగార్జున సాగర్, ప్రకాశం బ్యారేజ్, వగైరా ప్రాజెక్టులు కృష్ణానదిపై నిర్మితమయ్యాయి. కొయినా, వరుణా, ఘటప్రభ, మలప్రభ, భీమా, తుంగ, భద్ర, మూసి వంటి సుమారు 60 ఉపనదులు కృష్ణమ్మలో కలుస్తున్నాయి. వీటిపై కూడా చిన్న పెద్దా ఎన్నో ప్రాజెక్టులు కట్టారు. కృష్ణ నీరు నీలం రంగులో కనపడటంతో కృష్ణానది అని, స్త్రీల జడపాయలుగా పారుతుండటం చేత కృష్ణవేణి అని పేర్లు పెట్టుకున్నారు.

## పురాణ కథనం

పుష్కరుడు బ్రహ్మదేవుడి కమండలంలో చిక్కి, వివిధ రాశులలో ఆయన ప్రవేశించినపుడు మొదటి, చివరి 12 రోజులు సంబంధిత నది జలాల్లో ప్రవేశిస్తాడన్నేది పురాణగాథ. కన్య రాశిలో ప్రవేశించినపుడు కృష్ణా నదిలో ప్రవేశిస్తాడని చెప్పుతున్నారు.

"కన్యారాశి గతే జీవే కృష్ణవేణీ నదీతటే
స్నానం,దానం,తథా క్షౌరం త్రికోటి కుల ముద్ధరేత్" అని చెప్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో మహబూబ్‌నగర్, కర్నూలు, నల్గొండ, గుంటూరు, కృష్ణా జిల్లాల గుండా కృష్ణా నది ప్రవహిస్తున్నది. మహారాష్ట్రలో 306 కి.మీ., కర్నాటకలో 482 కి.మీ, ఆంధ్రప్రదేశ్‌లో 612 కి.మీ. ఇలా 1400 కి.మీ ప్రవహించి విజయవాడకు 40 కిలోమీటర్ల దూరంలో పులిగడ్డవద్ద రెండుపాయలుగా చీలి 15 మైళ్ల తర్వాత మూడుపాయలై కదిలి హంసలదీవిలో సముద్రంలో కలిసి మజిలీ పూర్తి చేసుకుంది.

## పుష్కరాలు

ఆగస్టు నెల 28తో ప్రారంభమై సెప్టెంబర్ 8 నాటికి కృష్ణా పుష్కరాలు ముగుస్తాయి. పుష్కరాలను జయప్రదంగా నిర్వహించడానికి ప్రభుత్వం 210 కోట్ల రూపాయల ఖర్చుతో అనేక సన్నాహాలు →

## కృష్ణ పుష్కర స్నానాలు చేసేవారు తీసుకోవలసిన జాగ్రత్తలు

పుష్కరాల సందర్భంగా కృష్ణా నదిలో స్నానాలు చేయడం వల్ల కొన్ని జబ్బులు రావచ్చు. కలుషితమైన నీటి వల్ల విష జ్వరాలు, పచ్చకామెర్లు, చర్మవ్యాధులు సంక్రమించే అవకాశం ఉండవచ్చు. నదీ స్నానం చేసిన తర్వాత యాత్రికులు లాడ్జి లేదా ఇంటికి వెళ్లిన తర్వాత వెంటనే రెండోసారి స్నానం చేస్తే మంచిది.

**ఆరోగ్య సూచనలు :**

- ఏ మాత్రం అనారోగ్యంగా ఉన్నా జాప్యం చేయకుండా వెంటనే వైద్యుని సంప్రదించాలి. జ్వరం, వాంతుల లక్షణాలు కన్పిస్తే అశ్రద్ధ చేయవద్దు.
- తాగేనీరు కలుషితం లేకుండా జాగ్రత్తలు పాటించాలి. ఫిల్టర్ నీళ్ళు కాని, కాచివడపోసిన నీటిని కాని తాగాలి.
- నీళ్లు తాగేటప్పుడు గ్లాసులు, వాటర్ బాటిళ్లను శుభ్రం చేయాలి.
- అలాగే పరిశుభ్రమైన ఆహారాన్ని తీసుకోవాలి.
- పాచి ఆహారం కాకుండా వేడి పదార్థాల ను మాత్రమే తీసుకోవాలి.
- వీధులు, రోడ్లపై అమ్మే ఆహార పదార్థాలు, తీపి పదార్థాలు, నీళ్ల ప్యాకెట్లు తీసుకోవద్దు.
- వ్యక్తిగత పరిశుభ్రతను పాటించాలి.
- అన్నం భుజించే సమయంలో చేతులను శుభ్రంగా కడుక్కోవాలి.
- దోమలు కుట్టకుండా చేతులు, కాళ్లు కవర్ అయ్యే విధంగా దుస్తులను ధరించాలి.

**పర్యవరణ సూచనలు...**

- పిండ ప్రదానం- ప్లాస్టిక్ కవర్లలో చేస్తే పాపం. ఆకు దొప్పలలో చేస్తే పుణ్యం.
- సంప్రదాయం పేరుతో నూనెలు, సబ్బులు, ప్లాస్టిక్ వస్తువులు నీళ్ళలోకి వదలొద్దు. నదీ జలాలను కలుషితం చేయొద్దు. అనవసర ప్యాకేజీని తగ్గిద్దాం- బట్ట సంచీలనే వాడుదాం
- నదీ జలాల్లో బట్టలు ఉతకడం, సబ్బులు, షాంపూలతో స్నానాలు చేయడం మానండి.
- నీళ్ళలో గాలి ఉంటేనే జలచరాలు బతుకుతాయి. పుష్కర ప్రాంతాన్ని పవిత్రతతో, పరిశుభ్రంగా ఉంచాలి.
- చెత్త పేరుకుపోతే కాలువల, నదుల ప్రవాహం ఆగిపోతుంది.

చేస్తున్నది. మహబూబ్‌నగర్‌లో 19, నల్లగొండలో 24, కర్నూలులో 8, గుంటూరులో 57, కృష్ణా జిల్లాలో 100 మొత్తం 208 స్నాన ఘట్టాల నిర్మాణానికి సన్నాహాలు జరిగాయి. ప్రయాణికుల సౌకర్యం కోసం మరుగుదొడ్లు, మురుగునీటి పారుదల, తాత్కాలిక నివాస స్థలాల ఏర్పాట్లు, త్రాగునీటి సదుపాయం, యాత్రికులు దుస్తులు మార్చుకునే సదుపాయం, ప్రథమ చికిత్స, వైద్య సదుపాయాలు వగైరాలు కల్పించటానికి ప్రభుత్వం తగు ఏర్పాట్లు చేస్తున్నది.

వీటితోపాటు అప్రోచ్ రోడ్లు, విద్యుత్ సదుపాయం, యాత్రికులకు రవాణా సదుపాయం, వగైరాలను కూడా అందించడానికి ప్రభుత్వ శాఖలు చురుగ్గా కదులుతున్నాయి. లక్షలాది మంది ప్రజలు నదీ స్నానాలకు వస్తారని ప్రభుత్వం అంచనాలు వేస్తున్నది.

**పుష్కరాల పుజారిణీ! కృష్ణవేణి....**

పడమటి కనుమలు ప్రసవించ పయనించి
ఘనమహారాష్ట్రపు గడప దాటి
ఇలతెల్గునేలపై కాలు మోపంగానే
వెయ్యేనుగుల శక్తి వెల్లివిరియ
నంది కొండకు నేగి వందనాలర్పించి
యల నమరావతి నాదరించు
విజయవాడను తాకి విజయాలు సాధించి
ఘన చరిత్ర సృష్టి ఘనతకెక్కి
సముధికోత్సాహి వగుచును సాగిపోయి
సాగరుని జేరు నీకిదే స్వాగతమ్ము
తాండవించెను నీజన్మ నిండు తృప్తి
పుష్కరాల పూజారిణీ! కృష్ణవేణి!

■ రావూరి ఏకాంబర కవి

### నదీ ప్రాశస్త్యం

కృష్ణా నది పరివాహక ప్రాంతంలో అనేక పుణ్య క్షేత్రాలున్నాయి. శ్రీశైలం మల్లికార్జున స్వామి, విజయవాడ శ్రీ కనకదుర్గ ఆలయం వంటి ప్రసిద్ధ ఆలయాలెన్నో ఉన్నాయి. క్రీస్తు శకారంభంలోనే మన రాష్ట్రంలో బౌద్ధమతం విరివిగా ప్రచారంలో ఉండేది. దానికి సాక్ష్యంగా నాగార్జున కొండ, అమరావతి నేటికి మన ముందున్నాయి. నాటికాలపు శిల్ప సంపద నేటికీ పర్యాటకులను అలరిస్తూనే ఉంది. ఆంధ్రుల సాహితీ, సాంస్కృతిక సంపదలకు కృష్ణానది పరివాహక ప్రాంతం పుట్టినిల్లు. ఇచ్చటనే శ్రీకాకుళంలో ఆంధ్రమహావిష్ణు శాతవాహన రాజ్యాన్ని ప్రతిష్ఠాపించారు. నేడు కుగ్రామంగా మిగిలిన శ్రీకాకుళం ఒకనాడు విశాల ఆంధ్ర సామ్రాజ్యానికి రాజధానిగా ప్రభవిల్లింది. ఈరాజ్యాపు ఎల్లలు మహారాష్ట్ర, చత్తీస్‌ఘడ్, దక్షిణాన తంజావూర్ వరకూ విస్తరించి ఉండేది. ఆనాటి కాలంలోనే ఆంధ్రులు నౌకాయానంలో విదేశీ వ్యాపారంలో ముందు పీఠిన ఉండే వారు.



అమరావతి స్థూపము

కొండపల్లి బొమ్మలు, కూచిపూడి నాట్యాలు, క్షేత్రయ్య మువ్వ గోపాల గీతాలు ఈ ప్రాంత సాహితీ, సాంస్కృతులకు నిదర్శనం. స్వాతంత్ర్యోద్యమకాలం నుండీ విజయవాడ ఒక రాజకీయ కేంద్రంగానే ఉన్నది. అలనాడు యువతలో స్వాతంత్ర్య పిపాసను పురికొల్పిన కృష్ణాపత్రిక, ప్రజాశక్తితో సహా అనేక తెలుగు దిన పత్రికలు ఇచ్చటి నుండే ప్రచురించబడేవి. ■

కృష్ణ పుష్కరాల శుభాకాంక్షలతో ....

# జిల్లా మహిళా మరియు శిశు సంక్షేమాభివృద్ధి సంస్థ
# మహబూబ్‌నగర్

## మహబూబ్‌నగర్ జిల్లాలో అమలు చేస్తున్న కార్యక్రమాలు, పథకాల వివరాలు

* అనుబంధ పోషకాహార పథకము క్రింద 16 ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టులందు 3154 అంగన్‌వాడి కేంద్రాలను ఏర్పాటు చేసి 14,584 మంది పిల్లలకు, 37,873 మంది గర్భిణి స్త్రీలకు పోషకాహారం ఇవ్వబడుతున్నది.
* తల్లుల కమిటీల ఏర్పాటు ద్వారా 16 ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టుల పరిధిలో 3214 తల్లుల కమిటీలు ఏర్పాటయి చురుగ్గా పనిచేస్తున్నాయి.
* **సివిల్ వర్క్స్ :** 16 ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టుల పరిధిలలోని 876 అంగన్‌వాడి కేంద్రాలకు పక్కా గృహాలు నిర్మింపచేసినాము. 581 కేంద్రాలలో చేతి పంపులు వేయించినాము.
* **ఆడబిడ్డ సంరక్షణ పథకం :** ఈ పథకం ద్వారా పేద కుటుంబంలో పుట్టిన ఆడపిల్లకు పాఠశాలకు పంపి ఉచిత విద్య నేర్పించుటకు, 18 సం॥ల వయసు తర్వాతే వివాహము జరిగేట్లు చూడటం దీని ఉద్దేశ్యం, ఈ పథకం అమలులో భాగంగా 2892 మంది లబ్దిదారులకు 1,44,60,000 రూ॥లు ఇవ్వటం జరిగింది.
* బాలికా సమృద్ధి యోజన పథకం క్రింద ఎవరైతే 1997 సం॥ తర్వాత జన్మించిన బాలికలకు 500/- రూ॥ల ఋణము 7707 మంది లబ్దిదారులకు 41,15,000/- రూ॥లు మంజూరు చేయడం జరిగింది.
* బాల సదనము జిల్లా యందు 5 బాలసదనములు పనిచేయుచున్నవి. ఒక్కొక్క కేంద్రంలో 60 మంది బాలికలు (7 సం॥ల నుండి 16 సం॥ల వరకు) బీద, అనాథ పిల్లలను చేర్చుకొని 1వ తరగతి నుండి 10వ తరగతి వరకు ఉచిత విద్య, భోజన, నివాస సదుపాయాలు కల్పించబడినవి.
* రాష్ట్ర సదనము మహబూబ్‌నగర్ నందు 1961 నుండి పనిచేస్తున్నది. ఇందులో భర్తచే విడవబడినవారు. ఆర్థికంగా వెనకబడి నిరాధారమైన మహిళలు 18-35 సం॥ల వయస్సు గల వారికి వసతి కల్పించి చదువు, వృత్తి విద్యలో శిక్షణ ఇప్పించడం జరుగుతున్నది.
* డే కేర్ సెంటర్లు జిల్లాలోని నాగర్‌కర్నూల్-2, షాద్‌నగర్-2, అచ్చంపేట -2, బిజినపల్లి -2, ఆమన్‌గల్-2, కల్వకుర్తి-2, మ.నగర్-2, మద్దూర్-1లలో నడుపబడుచున్నవి.
* రక్తహీనత నిర్మూలన కొరకు గర్భిణి స్త్రీలు, కిశోర బాలికలు, చిన్న పిల్లలు రక్తహీనత బారిన పడకుండా జిల్లాలో రక్తహీనత నిర్మూలన ప్రాజెక్టు ఏర్పాటు చేసి క్యాప్సుల్స్, సిరప్, పాలిక్ యాసిడ్ మాత్రలు పంపిణీ చేయడం జరుగుతున్నది.

పై పథకాలే కాకుండా ఇంకా అనేక పథకాలలో మహిళలను సామాజికంగాను ఆర్థికంగాను స్వావలంబన చేకూర్చడమేకాక, విద్య, పోషణ, ఆరోగ్యము, పరిశుభ్రతపై అవగాహన ఏర్పరచుకొని న్యాయమైన హక్కులను తెలుసుకొని అభివృద్ధి దిశగా పయనింపచేయడమే మా సంస్థ లక్ష్యం.

**ప్రాజెక్టు డైరెక్టర్**
**జిల్లా మహిళా మరియు శిశు సంక్షేమ శాఖ**
**మహబూబ్‌నగర్ జిల్లా**

5

❑ ఇన్సూరెన్స్ జాతీయకరణ దినోత్సవం

# 48 వసంతాలు పూర్తి చేసుకున్న పటిష్టమైన ఎల్.ఐ.సి



| | 1957 | 2004 |
|---|---|---|
| పాలసీల సంఖ్య | రు.57 లక్షలు | రు.17 కోట్లు |
| లైఫ్ ఫండ్ | రు.410 కోట్లు | రు.3,40,000 కోట్లు |
| క్లెయిమ్‌ల చెల్లింపు | రు.25 కోట్లు | రు.18,284 కోట్లు (99.87శాతం క్లెయిమ్‌ల చెల్లింపు) |
| ప్రభుత్వానికి చెల్లించిన డివిడెండ్ | రు.1.45కోట్లు | రు.488 కోట్లు |
| సామాజిక రంగంలో పెట్టుబడి | రు.8 కోట్లు | రు.32,089 కోట్లు |

**సెప్టెంబరు 1, 2004 నాటికి భారతీయ జీవిత భీమా సంస్థ (ఎల్ఐసి) 48 సంవత్సరాల విజయవంతమైన చరిత్రను పూర్తి చేసుకుంది**

**1956 సెప్టెంబరు 1వ తేదీన ఎల్.ఐ.సి ఏర్పడిన నాటి నేపథ్యం ఒక్కసారి పరిశీలిస్తే ప్రభుత్వ ఇన్సూరెన్స్ రంగం ప్రాధాన్యత అర్థమౌతుంది.**

1956 కు పూర్వం 243 ప్రైవేటు ఇన్సూరెన్స్ కంపెనీలు ఉండేవి. ఆ కంపెనీలు జీవిత భీమాను తమ పెట్టుబడులు సమకూర్చే సాధనంగా వాడుకొనేవి. ప్రజల సొమ్ముకు భద్రత కల్పించేవి కావు. ఉదాహరణకు 1954 సంవత్సరం క్లెయిమ్స్ పరిష్కార గణాంకాలను పరిశీలిస్తే 36 శాతం నుండి 74.7 శాతం క్లెయిమ్స్ ఎగగొట్టిన ఘనత ప్రైవేటు కంపెనీలలో కనిపిస్తుంది. ఈ కారణాల దృష్ట్యా జీవిత బీమాను జాతీయం చేసి ప్రభుత్వం ఎల్.ఐ.సి ని ఏర్పరిచింది. ప్రజల ప్రీమియం సొమ్మును పెట్టుబడిగా మార్చి తిరిగి సమాజానికి అందించాలని, ప్రజల సొమ్ముకు భద్రత ఏర్పర్చాలని ప్రభుత్వం ఎల్.ఐ.సి. ముందుంచిన లక్ష్యాలు. 1956 నాటి నుండి నేటివరకూ గణాంకాలు చూస్తే ఎల్.ఐ.సి తన లక్ష్యాలు చేరుకుందన్న విషయం తెలుస్తుంది.

ఈ విధంగా జాతీయీకరణ అనంతరం అప్రతిహతంగా సాగుతున్న ఎల్.ఐ.సి విజయాలకు, ప్రభుత్వమే ఆటంకాలు కల్పించటం ప్రారంభించింది.

ప్రైవేటు కంపెనీలు ప్రజల సొమ్ముకు రక్షణ కల్పించలేవని తెలిసినా, అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడి, స్వదేశీ గుత్తపెట్టుబడిదారుల ఒత్తిడికి తలొగ్గిన బి.జె.పి నాయకత్వంలోని కేంద్ర ప్రభుత్వం 2000 సంవత్సరంలో ప్రైవేటు ఇన్సూరెన్సు కంపెనీలకు లైసెన్సులు ఇచ్చింది. వారి పని విధానాన్ని పూర్తిగా నియంత్రిస్తామని చెప్పి ఇన్సూరెన్స్ రెగ్యులేటరీ అథారిటీని (IRDA ను) నెలకొల్పింది.

అయితే ప్రైవేటు కంపెనీలు యధావిధిగా తమ లాభాల వేటలో ప్రయాణం చేస్తున్నా ఇన్సూరెన్స్ రెగ్యులేటరీ అథారిటీ చూస్తూ ఊరుకొంటోంది. పైగా "ప్రైవేటు కంపెనీలలో పాలసీలు చేసినా మేము ఉన్నాం ఫరవా లేదు" అని చెప్పి ప్రకటనలు గుప్పిస్తోంది. ప్రైవేటు కంపెనీలు క్లెయిమ్‌లు ఏ విధంగా పరిష్కారం చేస్తున్నాయనే విషయం పై ఐ.ఆర్.డి.ఎ. లెక్కలను బహిర్గతం చేయడం లేదు. సామాజిక, గ్రామీణ రంగాలలో వీరు ఇన్సూరెన్స్ వ్యాపారాన్ని చేయకున్నా వారిపై చర్యలు లేవు.

ఇవన్నీ కాకుండా ఇపుడు క్రొత్తగా ఈ ప్రైవేటు కంపెనీలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని పెంచాలని ప్రభుత్వం ప్రతిపాదిస్తోంది. ఆ విధంగా ఈ ప్రైవేటు కంపెనీలను మరింత బలోపేతం చేయాలనేది ప్రభుత్వోద్దేశ్యం.

ఇన్ని సవాళ్లనూ ఎదుర్కొని ఎల్ఐసి ముందుకు సాగుతోంది. 2003-04 ఆర్థిక సంవత్సరంలో నూతన పాలసీలలో 12 ప్రైవేటు కంపెనీల వాటా 8 శాతంగా ఉండగా, ఎల్.ఐ.సి. అత్యధికంగా 92 శాతం వాటాతో పోటీని తట్టుకొని పటిష్టంగా నిలబడింది. 2003 సం॥లో ఓ.ఆర్.జి.మార్గ్ మరియు ఎకనమిక్ టైమ్స్ సంయుక్తంగా నిర్వహించిన సర్వేలో "ఎల్.ఐ.సి నంబర్ వన్ సర్వీసు బ్రాండ్‌గా" నిలిచింది. సర్వీసు రంగంలోని అనేక ప్రైవేటు కంపెనీలన్నింటినీ అధిగమించి ఎల్.ఐ.సి ఈ ఖ్యాతిని సాధించింది.

ఎల్.ఐ.సి.ని కాపాడుకోవడానికి ఆల్ ఇండియా ఇన్సూరెన్స్ ఎంప్లాయిస్ అసోసియేషన్ నాయకత్వంలో ఇన్సూరెన్స్ ఉద్యోగులు ఆందోళనా, పోరాట కార్యక్రమాలను గత పదేళ్లుగా నిర్వహిస్తున్నారు. దీనిలో ప్రధానమైన నినాదం " క్యాంపెయిన్ ఎట్ ది సీట్- క్యాంపెయిన్ ఆన్ ది స్ట్రీట్ ". అంటే ఆఫీసులో సేవలను మెరుగుపర్చి పాలసీదారుల అభిమానం చూరగొనడం, ఎల్.ఐ.సి పటిష్టతను ఆఫీసు వెలుపల సమాజంలో ప్రచారం చేయడం. ఈ జంట కార్యక్రమాల ద్వారానే ఎల్.ఐ.సి. పటిష్టతకై 1999-2000 సంవత్సరంలో ఒక కోటి యాభై నాలుగు లక్షల మంది ప్రజల పిటిషన్‌ను పార్లమెంటుకు ఏ.ఐ.ఐ.ఇ.ఏ. అందజేయగలిగింది. ఈ ప్రజాభిమానమే ఎల్.ఐ.సి. మార్కెట్ షేర్‌ను కూడా పెద్ద స్థాయిలో నిలిపింది.

సెప్టెంబరు 1వ తేదీన తిరిగి ఎల్ఐసి ఉద్యోగులు ఒక ప్రతిజ్ఞ చేయబోతున్నారు. "ప్రభుత్వ రంగ ఎల్.ఐ.సి. ని కాపాడేందుకు మా పోరాటాలతో బాటు ప్రజాభిప్రాయాన్ని పెద్ద ఎత్తున కూడగడతాం. ఎల్.ఐ.సి.ని కాపాడుకుంటాం". ఈ నినాదమే రాబోయే కాలంలో ఎల్.ఐ.సి ఉద్యోగుల పోరాటాలను నిర్దేశించేదిగా ఉంటుంది.

■ **వేణుగోపాల్**

ప్రధాన కార్యదర్శి ఎ.ఐ.ఐ.ఇ.యు.

# వీరి జీతాలు ఎంతో చూడండి!

ఈ క్రింద తెలుపబడిన వారంతా వివిధ కంపెనీల చీఫ్ ఎగ్జిక్యూటివ్‌లు 2003-2004 సం॥లో కమిషన్ రూపంలో, జీతాల రూపంలో, ఇతర చెల్లింపుల ద్వారా వారు పొందిన మొత్తం ఎంతో చూడండి :

| జీతంగా రెమ్యూనరేషన్ పొందినది | పేరు | హోదా | కంపెనీ |
|---|---|---|---|
| రు.11 కోట్ల 71 లక్షలు | బ్రిజ్‌మోహన్ లాల్ మంజల్ | ఛైర్మన్ | హీరో హోండా మోటార్స్ |
| రు.11 కోట్ల 62 లక్షలు | ముఖేష్‌అంబానీ | సి & ఎం.డి. | రిలయన్స్ ఇండస్ట్రీస్ |
| రు.11 కోట్ల 62 లక్షలు | అనిల్ అంబానీ | వైస్ ఛైర్మన్ & ఎం.డి | రిలయన్స్ ఇండస్ట్రీస్ |
| రు.11 కోట్ల 53 లక్షలు | పవాన్ మంజల్ | ఎం.డి. | హీరోహోండా మోటార్స్ |
| రు.11 కోట్ల 36 లక్షలు | అకీయో కజూసా | జాయింట్ డైరెక్టర్ | హీరోహోండా మోటార్స్ |
| రు.10 కోట్ల 12 లక్షలు | సినీచీ నకయామా | హోల్‌టైమ్ డైరెక్టర్ | హీరోహోండా మోటార్స్ |
| రు.8 కోట్ల 40 లక్షలు | పంకజ్ ఆర్.పటేల్ | ఎం.డి. | కాడిలా హెల్త్ కేర్ |
| రు.5 కోట్ల 70 లక్షలు | వివేక్‌పాల్ | వైస్ ఛైర్మన్ | విప్రో |
| రు.5 కోట్ల 12 లక్షలు | ఓంకార్ ఎస్.కన్వర్ | సి & ఎం.డి. | అపోల్లో-టైర్స్ |
| రు.4 కోట్ల 20 లక్షలు | కమల్ కె.సింగ్ | సి & ఎం.డి. | రోట్లా ఇండియా |
| రు.4 కోట్ల 05 లక్షలు | డి.ఎస్.బ్రార్ | సి.ఓ & ఎం.డి. | రాన్‌బాక్సీల్యాబ్స్ |
| రు.3 కోట్ల 79 లక్షలు | అజిత్ గులాబ్ చంద్ | సి & ఎం.డి. | హిందూస్థాన్ కన్‌స్ట్రక్షన్స్ |
| .3 కోట్ల 65 లక్షలు | బ్రెయిన్ డబ్ల్యు.టెంపెస్ట్ | ఎం.డి. & సి.ఇ.ఓ. | రాన్‌బాక్సీల్యాబ్స్ |
| రు.3 కోట్ల 65 లక్షలు | సురేష్ కృష్ణా | సి & ఎం.డి. | సుందరం పాస్టెనర్స్ |
| రు.3 కోట్ల 33 లక్షలు | డా॥కె.అంజిరెడ్డి | ఎగ్జిక్యూటివ్ ఛైర్మన్ | డా॥రెడ్డీస్ ల్యాబ్స్ |
| రు.2 కోట్ల 98 లక్షలు | ఎస్.సి.మెహతా | ఎం.డి. | దీపక్ ఫెర్టిలైజర్స్ |
| రు.2 కోట్ల 95 లక్షలు | ఎన్.ఎస్.శాక్ సారియా | ఎం.డి. | గుజరాత్ అంబూజా |
| రు.2 కోట్ల 88 లక్షలు | వి.కె.కౌల్ డైరెక్టర్ | అడిషనల్ | రాన్‌బ్యాక్సీ ల్యాబ్స్ |
| రు.2 కోట్ల 76 లక్షలు | సుధీర్ మెహతా ఛైర్మన్ | ఎగ్జిక్యూటివ్ | టోరంట్ ఫార్మా |
| రు.2 కోట్ల 62 లక్షలు | బి.ఎన్.కల్యాణి | సి & ఎం.డి. | భారత్ ఫోర్జ్ |
| రు.2 కోట్ల 42 లక్షలు | ఎం.ఎస్.భంగా | ఛైర్మన్ | హిందూస్థాన్ లివర్ |

(ఇందులో వారికి షేర్ల రూపంలో ఇవ్వబడే చెల్లింపులు చూపలేదు సుమా!)

ఆధారం : 'బిజినెస్ లైన్'- 10 ఆగస్టు, 2004

# పతకం సాధించింది ఇతడే రాథోడ్



ఏథెన్స్ ఒలింపిక్స్‌లో పురుషుల షూటింగ్ డబుల్ ట్రాప్‌లో భారత్‌కు తొలి పతకాన్ని సాధించిన వీరజవాన్ రాజ్యవర్థన్ సింగ్ రాథోడ్

# జె.జె.-శోభ



ఒలిపింక్స్‌లో ఈమె జావలిన్ త్రోలో అత్యుత్తమ వ్యక్తిగత రికార్డును సాధించినా ఆ సమయంలోనే తీవ్రంగా గాయపడింది. ఎడమ కాలి నరం పట్టేసింది. 800 మీటర్ల పరుగులో పాల్గొనబోదని నిర్వాహకులు ప్రకటించారు. అయినా పోటీకి సిద్ధపడి, మొండి పట్టుదలతో గమ్యం చేరి 3వ స్థానంలో నిలిచి పతకాలు రాకపోయినా హృదయాలను గెలుచుకుంది. ఈమె సికింద్రాబాద్ రైల్వేలో సీనియర్ క్లర్కుగా పనిచేస్తూ ఆంధ్రప్రదేశ్ తరపున పాల్గొన్నారు.

# ఉద్యమవార్తలు

## అనంతపురం సదస్సు




అనంతపురంలో ఆగస్టు 22న 500 మందితో భవన నిర్మాణ కార్మిక సంఘం పట్టణ సదస్సు జరిగింది. నూతన నాయకత్వం ఎన్నికైంది. రాష్ట్ర అధ్యక్షులు రత్నాకర కోటంరాజు, రాష్ట్ర కమిటీ సభ్యులు లోకేష్ ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. **ఎన్నికైన నూతన కమిటీ :** గౌ.అధ్యక్షులు వి.రాంభూపాల్ (సిఐటియు జిల్లా అధ్యక్షులు), అధ్యక్షులు శేషయ్య, ఉపాధ్యక్షులు రాముడు, పెద్దన్న, పోతులయ్య, చలమయ్య, రసుల్, భూషి, కార్యదర్శి శ్రీ రామాంజనేయులు, సహాయ కార్యదర్శులు గోపాల్, బయ్యపురెడ్డి, ఎర్రమల్లయ్య, శ్రీనివాసులు, ఎస్.కె.వెంకటేష్, ట్రేజరర్ దేవరాజ్.

## రైల్వే పార్శిల్ సర్వీస్‌ను పునరుద్ధరించాలి. పార్శిల్ హమాలీ పోర్టర్లకు పని కల్పించాలి.

ఆగస్టు 3న హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో రైల్వే పార్శిల్ హమాలీ, పోర్టర్ల సదస్సు జరిగింది. సంవత్సరాల తరబడి పని చేస్తున్న రైల్వే పార్శిల్ హమాలీ, పోర్టర్ల పనిని నిలుపుదల చేస్తూ రైల్వే బోర్డు జారీ చేసిన సర్క్యులర్‌ను ఉపసంహరించుకొని, పార్శిల్ సర్వీసులను కొనసాగిస్తూ వారి పనిని పునరుద్ధరించాలని సదస్సు డిమాండ్ చేసింది. సదస్సు సిఐటియు రాష్ట్ర కార్యదర్శి పాలడుగు భాస్కర్ అధ్యక్షతన జరిగింది. ఈ సదస్సులో మాజీ రాజ్యసభ సభ్యులు శ్రీ వై.రాధాకృష్ణ మూర్తి గారు, సిఐటియు రాష్ట్ర కార్యదర్శి భూపాల్ పాల్గొని ప్రసంగించారు.

### రైల్వే పార్శిల్ హమాలీ, పోర్టర్ల యూనియన్ ఏర్పాటు

రాష్ట్ర వ్యాప్తంగా వున్న రైల్వే స్టేషన్లలో పని చేస్తున్న పార్శిల్, హమాలీల, పోర్టర్ల రాష్ట్ర స్థాయి సదస్సు సందర్భంగా రైల్వే పార్శిల్ హమాలీ, పోర్టర్ల యూనియన్ ఏర్పాటు చేసుకొని కన్వీనింగ్ కమిటీని ఏర్పాటు చేసుకున్నది. రాష్ట్ర కన్వీనర్‌గా పాలడుగు భాస్కర్, రాష్ట్ర కమిటీ సభ్యులుగా సి.హెచ్.లింగయ్య, రమేష్ (ఖమ్మం), షేక్ సర్వర్, శంకర్ (వరంగల్), జి.యల్లయ్య, సి.హెచ్.సుధాకర్ (మహబూబ్ నగర్), ఎస్.కె.రహీమతుల్లా, సుబ్బయ్య (నెల్లూరు), హోహన్ (ఆకీవీడు), పేరయ్య (బాపట్ల), కోటయ్య (చీరాల), అప్పారావు, సన్యాసిరావు (అనకాపల్లి), కోటయ్య (ఒంగోలు), జి.సాంబయ్య (రేపల్లే), ఎస్.కె.షామియా (గుడివాడ) లు ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

## సి.ఐ.టి.యు. ప్యానల్ గెలుపు

జూలై 23న స్పాంజ్ ఐరన్ ఇండియా లిమిటెడ్‌లో యూనియన్ గుర్తింపు ఎన్నికలు జరుగగా సిల్ కార్మిక సంఘం ఇ-1638 (సిఐటియు) గెలుపొందింది. సిఐటియు యూనియన్ స్వతంత్ర సంఘం ఇ-245తో పొత్తు పెట్టుకుంది. సిఐటియు ప్యానల్‌కు 111 ఓట్లు రాగా, ఐఎన్‌టియుసి 91 ఓట్లను పొంది ఓడిపోయింది. గత ఎన్నికల్లో కూడా అలయెన్సుగా సిఐటియు నాయకత్వంలోని యూనియనే గెలిచింది. అప్పటి నుంచీ కార్మికుల సమస్యలపై చురుకైన పాత్ర నిర్వహించటంతో ఈ ఎన్నికల్లోనూ కార్మికులు సిఐటియు ప్యానల్నే గెలిపించారు.

గతంలోని కేంద్ర ప్రభుత్వం 100 శాతం పెట్టుబడులను ఉపసంహరించుకొని ఫ్యాక్టరీని ప్రైవేటుపరం చేయజూసింది. సిఐటియు యూనియన్ దీన్ని వ్యతిరేకించి హైకోర్టులో గిరిజన సంఘం ద్వారా కేసు వేయించి స్టే పొందింది. కార్మికులలో ప్రచారం చేసి వి.ఆర్.ఎస్. ద్వారా ఉద్యోగం వదులుకొని పోకుండా కృషి చేసింది. కంపెనీని నష్టాల బాట నుంచి లాభాల బాట పట్టేట్లు చూసింది. అందువల్ల కార్మికుల అభిమానాన్ని చూరగొన్నది.

## పి.ఎఫ్.వడ్డీరేటు తగ్గింపుపై కార్మికుల నిరసన



కార్మికుల సంతకాలను సేకరిస్తున్న ఇల్లందు సిఐటియు నాయకులు

సి.ఎం.పి.ఎఫ్. వడ్డీని 8.5 శాతానికి తగ్గించటం పై, ఇతర బొగ్గుగని కార్మికుల సమస్యలపై ఇల్లందులో సింగరేణి కార్మికుల నుండి సిఐటియు సంతకాలు సేకరించింది. ఈ కార్యక్రమంలో బ్రాంచ్ కార్యదర్శి నర్సింహారావు, ఉపాధ్యక్షుడు గోపాల్, నాయకులు వజ్జముత్తయ్య, సూర్యనారాయణ, పగడాల నాగేశ్వరరావు, శంకర్, వీరయ్య పాల్గొన్నారు.




సిఎంపిఎఫ్ కార్యాలయం సూపరింటెండ్‌కు వినతిపత్రం సమర్పిస్తున్న సిఐటియు నాయకులు

# తిరుమలేశుని సాక్షిగా శ్రమ దోపిడీ

తిరుమలలో ఉన్న అన్ని సత్రాలు, గుడులు, గోపురాలు, మ్యూజియం, రోడ్లు, మరుగుదొడ్లను నిత్యం ఊడుస్తూ, తుడుస్తూ, కడుగుతూ, పరిశుభ్రంగా ఉంచుతూ, గొడ్డుచాకిరీ చేస్తూ పారిశుధ్య కాంట్రాక్టు కార్మికులు జీవిస్తున్నారు.

పారిశుధ్య పనిని టిటిడి వారు కాంట్రాక్టు కిచ్చారు. నాలుగు సంస్థలు కాంట్రాక్టుల క్రింద సుమారు 2 వేల మంది కాంట్రాక్టు కార్మికులుగా పని చేస్తున్నారు. వీరిలో సగం మహిళలు. మూడు షిఫ్టులుగా పనిలో నిమగ్నమై ఉంటారు. వీరికి నెలకు ఇచ్చేది 11 వందల నుండి 16 వందల రూపాయలు. టిటిడి వారు మాత్రం జి.ఓ.నెం.524 ప్రకారం రూ.2220/-లు కాంట్రాక్టర్లకు చెల్లిస్తుంటారు. కార్మికులకు రావలసిన జీతాల నుండి నెలకు 12 లక్షల రూపాయలు (2000×600=12,00,000) కాంట్రాక్టర్లు దోచుకుంటున్నారు.

స్మశానాల ప్రక్కన పాడుబడ్డ చిన్న గదుల్లో రూమ్‌కు 15 నుండి 20 మంది గుంపులుగా కాపురం ఉంటారు. సెలవులు, పి.ఎఫ్, ఇ.ఎస్.ఐ., బోనస్ వంటివి ఏవి అమలు కావు. పనిభద్రత లేదు. అధికారుల, సూపర్‌వైజర్ల వేధింపులు, బూతుతిట్లు నిత్యం కృత్యమే. ఇక మహిళా కార్మికుల బాధలు అన్నీ ఇన్నీ కావు.

చిత్తూరు జిల్లాలోనూ, పొరుగు జిల్లాల నుండీ పేదరికంతో కూలి దొరకక బాధపడుతున్న వారు, కరువుతో అల్లాడిపోయిన వారు, ఉపాధి కోసం వలస వచ్చి ఈ పని చేస్తున్నారు. ఆడవారి ఒంటరితనాన్ని ఆసరా చేసుకొని అధికారులు, సూపర్‌వైజర్స్ శారీరకంగా, మానసికంగా వేధిస్తుంటారు.

తిరుమలలో ఉన్న క్యాంటిన్‌లో ఒకప్పుడు 2 రూ॥లకు పెట్టే భోజనాన్ని టిటిడి వారు నేడు 5రూ॥లకు పెంచారు. దీనితో కాంట్రాక్టు కార్మికులు క్యాంటిన్‌కు వెళ్లడం మానేశారు. "పూటకు 5 రూ.లు పెట్టి తినడానికి మా దగ్గర డబ్బులెక్కడివి? అందుకే మానేశాం." అని కార్మికుని జవాబు. దీన్నిబట్టి వారి ఆర్థిక జీవన పరిస్థితి బోధపడుతుంది.

వీరికి కనీసవేతనం చెల్లించాలని, పనిభద్రత కల్పించాలని, చట్టబద్ధమైన హక్కులు, సౌకర్యాలు అమలు చేయాలని కోరుతూ, కార్మికులను ఐక్యపరచి ఆందోళనలు నిర్వహించడానికి ఏపి కాంట్రాక్టు ఎంప్లాయీస్ యూనియన్ (సిఐటియు) పూనుకున్నది. ఒకరోజు పని నిలిపివేయడం మూలంగా తిరుమల మొత్తం దుర్గంధమైంది. దీనితో అధికారులు, ప్రజాప్రతినిధులు ఉరుకులు పరుగులతో వచ్చి కాంట్రాక్టు కార్మికుల సమస్యలు పరిష్కరిస్తామని హామీ ఇచ్చారు కాని అమలు చేయలేదు. హామీలు అమలు చేసే వరకూ సి.ఐ.టి.యు ఆందోళన, పోరాటం కొనసాగుతూనే ఉంటుంది.

■ ఎ.ముత్యంరావు - కార్యదర్శి
ఏ.పి.కాంట్రాక్టు ఎంప్లాయీస్ యూనియన్ (సిఐటియు)

# 13 సం॥రాల తరువాత తిరిగి పనికి



నాగార్జున యూనివర్శిటీలో కనీసవేతనాలు అమలు చేయాలని అడిగిన పాపానికి 1992లో 44 మంది హాస్టల్ వర్కర్స్‌ను అప్పటి వైస్ ఛాన్సలర్ శ్రీ సింహాద్రి అక్రమంగా తొలగించారు.

తొలగించబడిన నాటి నుంచి 25శాతం బ్యాక్‌వేజ్ ఇస్తూ సర్వీసును, అటెండెంట్ బెనిఫిట్స్‌ను కొనసాగిస్తూ తిరిగి పనిలోకి తీసుకోవాలని 05.12.2003న సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. ఈ తీర్పు అమలు జరుపుతూ ఇప్పటి వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ వేణుగోపాల్ రెడ్డి గారు 04.08.2004న వర్కర్లను పనిలోకి తీసుకుంటూ ఉత్తర్వుల నిచ్చారు. 06.08.2004న 44 మంది వర్కర్లు పనిలో చేరారు. ఇది నాగార్జున యూనివర్శిటీ హాస్టల్ వర్కర్స్ యూనియన్ సిఐటియు సాధించిన ఘనవిజయం.

"ఫుడ్ ఫర్ వర్కర్స్"గా 1983 నుంచి యూనివర్శిటీలో నాలుగు హాస్టళ్లలో 50 మంది భోజనం పెట్టి రోజుకు 15/- రూ.లు నికృష్ట వేతనంతో పని చేసేవారు. ఎన్నిసార్లు విన్నవించుకున్నా పట్టించుకోనందున 20.11.92 నుండి ఈ ఉద్యోగులు కనీసవేతనాల కోసం సమ్మె చేశారు. 25.11.92న ఒప్పందం కుదిరింది. ఎవ్వరి పైనా కక్షసాధింపులు ఉండవని, డిమాండ్లను అంగీకరిస్తున్నానని ఒప్పందం చేసుకున్న అప్పటి వైస్ ఛాన్సలర్ సింహాద్రి 44 మందిని ఉద్యోగం నుండి తొలగించారు.

అనేక ఆందోళనలు తరువాత లేబర్ కోర్టులో కేసు నడిచి పూర్తి బ్యాక్‌వేజ్‌తో కంటిన్‌జెంట్ సర్వీసులో తిరిగి ఉద్యోగాలు ఇవ్వాలని 11.01.2000న తీర్పు వచ్చింది. యూనివర్శిటీ దీన్ని అమలు పరచకుండా హైకోర్టుకు, హైకోర్టు బెంచికు, సుప్రీంకోర్టుకు వెళ్ళింది. ఈ అన్ని కోర్టుల్లోనూ కార్మికులకు అనుకూలంగానే తీర్పులు వచ్చాయి. 05.12.2003న సుప్రీంకోర్టు ఎస్ఎల్‌పి నెం.7286/2003 పై తీర్పునిస్తూ 25శాతం బ్యాక్‌వేజెస్‌తో పనిలోకి తీసుకోవాలని తీర్పునిచ్చింది. 3 నెలల్లో అమలు చేయాలని చెప్పింది. ఈ తీర్పును కూడా బుట్టదాఖలు చేయడానికి యూనివర్శిటీ ముగ్గురు సభ్యులతో కమిటీ వేసి కాలయాపన చేసింది. కాని కమిటీ కూడా ఉద్యోగులకు అనుకూలంగానే రిపోర్టునిచ్చింది.

వర్కర్లను పనిలో పెట్టుకోవటానికి సిపిఎం పోలిట్‌బ్యూరో సభ్యుడు శ్రీ కొరటాల సత్యనారాయణ, శాసనసభ పక్ష నాయకులు నోముల నర్సింహయ్య గారలు ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపారు. ఫలితంగా నేటి వైస్ ఛాన్సలర్ ఆగస్టు 4న 44 మందిని ఉద్యోగంలో చేర్చుకోవాలని ఉత్తర్వులిచ్చారు. ■

# సహకార సంఘం ఉద్యోగుల పోరాటం





ఉద్యోగుల తొలగింపులకు నిరసనగా ఆగస్టు 16న ఎ.పి. స్టేట్ అగ్రికల్చరల్ కోఆపరేటివ్ సొసైటీస్ ఎంప్లాయీస్ యూనియన్ (సిఐటియు) ఆధ్వర్యంలో వేలాది మంది సహకార ఉద్యోగులు కలెక్టరేట్లను రాష్ట్ర వ్యాప్తంగా ముట్టడించారు. తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, విశాఖపట్నం, వరంగల్, శ్రీకాకుళం, తదితర జిల్లాలలో కలెక్టరేట్లు హోరెత్తాయి. అనేక చోట్ల కలెక్టర్లను ఆఫీసులోకి పోనివ్వలేదు. వేలాది మందిని అరెస్టులు చేశారు. అంతకుముందు కోపరేటివ్ సొసైటీల రిజిస్ట్రార్‌ను ఉభయ గోదావరి జిల్లాలలో ఘెరావ్ చేశారు. ప్రభుత్వం ఎట్టకేలకు దిగివచ్చి తాత్కాలికంగానైనా తొలగింపులను నిలుపు చేయటం ఉద్యోగుల పోరాటాల ఫలితమే. ఉద్యోగుల యూనియన్‌తో ప్రభుత్వం సెప్టెంబర్ 2వ తారీఖున చర్చలకు అంగీకరించింది. ఈ చర్చల్లో వచ్చిన ఫలితాలను బట్టి తదుపరి కార్యక్రమం నిర్ణయించబడుతుందని యూనియన్ గౌరవాధ్యక్షులు పి.అజయ్‌కుమార్ కార్మికలోకం ప్రతినిధితో చెప్పారు.





# బిటిఆర్ శత జయంతి సందర్భంగా శ్రామిక మహిళ సదస్సులు

బి.టి.ఆర్ శతజయంతి ఉత్సవాల సందర్భంగా కృష్ణా జిల్లాలో 2 చోట్ల శ్రామిక మహిళా సదస్సులు జరిగాయి. ఆగస్టు 24న విజయవాడ గ్రంథాలయం హాల్‌లో జరిగిన సదస్సుకు బిఎస్ఎన్ఎల్, బ్యాంకింగ్, పీర్‌లెస్, మున్సిపల్, షాప్ ఎంప్లాయిస్, అంగన్‌వాడీ రంగాల నుండి 150 మంది హాజరయ్యారు. శ్రామిక మహిళ విజయవాడ నగర్ కన్వీనర్ పి.రామసీత సదస్సుకు అధ్యక్షత వహించారు.

ఆగస్టు 25న కృష్ణా జిల్లా మచిలీపట్నంలో జరిగిన సదస్సుకు శ్రామిక మహిళ జిల్లా కన్వీనర్ ఎన్.సి.హెచ్.సుప్రజ అధ్యక్షత వహించారు. అంగన్‌వాడీ, మున్సిపల్, ఉపాధ్యాయ, ఇన్సూరెన్స్, మెడికల్ & హెల్త్ రంగాల నుండి 80మంది ఈ సదస్సులో పాల్గొన్నారు. పై రెండు సదస్సులలో శ్రామిక మహిళల రాష్ట్ర కన్వీనర్, సిఐటియు రాష్ట్ర కార్యదర్శి పి.రోజా, ఎ.పి.బీడీ & సిగార్ వర్కర్స్ యూనియన్ కార్యదర్శి జి.జ్యోతి, సిఐటియు జిల్లా కార్యదర్శి శ్రీ మోహన్ కుమార్‌లు, శ్రీ మూర్తిరాజులు ప్రసంగించారు. ఈ సందర్భంగా శ్రామిక మహిళల ప్రత్యేక సమస్యల పరిష్కారాన్ని కోరుతూ సంతకాల సేకరణ చేసి ప్రధాన మంత్రికి వినతిపత్రం ఇవ్వాలని సదస్సు తీర్మానించింది. ఇన్సూరెన్స్ రంగం మహిళా విభాగం నాయకురాలు శ్రీమతి మణివత్సల, యు.టి.ఎఫ్. జిల్లా నాయకురాలు వాణి, అంగన్‌వాడీ నాయకురాలు విజయలక్ష్మి, విజయవాడ నగర శ్రామిక మహిళా నాయకురాలు శ్రీమతి వాణి, కుసుమలు ప్రసంగించారు. వివిధ రంగాలలో పని చేస్తున్న మహిళలు తమ సమస్యలను సదస్సులో చర్చించారు.



ఆగస్టు 18న గ్రామపంచాయితీ వర్కర్స్ కడప జిల్లా ద్వితీయ మహాసభలో ప్రసంగిస్తున్న పాలడుగు భాస్కర్


ఆగస్టు 22న గ్రామపంచాయితీ వర్కర్స్ గుంటూరు జిల్లా ద్వితీయ మహాసభలో ప్రసంగిస్తున్న పాలడుగు భాస్కర్



# కర్నూలులో భవన నిర్మాణ కార్మికుల సదస్సు

కర్నూలులో భవన నిర్మాణ కార్మికుల సదస్సు జరిగింది. దీనికి సిఐటియు జిల్లా అధ్యక్షులు ఇ.పుల్లారెడ్డి అధ్యక్షత వహించగా, ఎపి బిల్డింగ్ వర్కర్స్ ఫెడరేషన్ రాష్ట్ర అధ్యక్షులు కాటంరాజు, ప్రధానకార్యదర్శి లోకేష్ ప్రసంగించారు.రాష్ట్రంలోని 30 లక్షల మంది భవన నిర్మాణ కార్మికుల కోసం సమగ్ర చట్టం చేయాలని డిమాండ్ చేశారు. ఈ సందర్భంగా ఇ. పుల్లారెడ్డి గౌరవాధ్యక్షులుగా, సంజన్న, ఆనంద్ అధ్యక్షకార్యదర్శులుగా జిల్లా కమిటీని ఎన్నుకున్నారు. ఉపాధ్యక్షులుగా బాబు, అన్వర్ హుస్సేన్, సహాయకార్యదర్శులుగా శంకర్ నాయక్, అన్వర్ నాసిర్, మగ్బుల్, నరసింహులు, కోశాధికారిగా మద్దయ్య ఎన్నికయ్యారు. కర్నూల్ పట్టణకమిటీ అధ్యక్షకార్యదర్శులుగా ఎస్ఎ బాబు, కబీర్, సహాయకార్యదర్శులుగా వెంకటేశ్వరరెడ్డి, డి. నల్లన్న, ఉపాధ్యక్షులుగా ఎ.రంజాన్, సామ్యూల్, కోశాధికారిగా జాకీర్ హుస్సేన్ ఎన్నికయ్యారు.

# ఖమ్మం జిల్లా సిఐటియు 6వ మహాసభ ఆహ్వాన సంఘం ఏర్పాటు

సిఐటియు 6వ మహాసభ కోసం సన్నాహంగా ఆహ్వానసంఘ సమావేశం ఆగస్టు 22న కొత్తగూడెంలో జరిగింది. వివిధ రంగాల ఉద్యోగ, కార్మిక నాయకులు, పురప్రముఖులు హాజరయ్యారు. స్థానిక ఎం.ఎల్.ఎ శ్రీ వనమా వెంకటేశ్వరరావు, ఖమ్మం ఎం.ఎల్.ఎ తమ్మినేని వీరభద్రం, సిఐటియు రాష్ట్ర ఆఫీసు బేరర్లు జి.రాములు, పి.రాజారావు గారు ఈ సమావేశంలో పాల్గొన్నారు. శ్రీ వనమా వెంకటేశ్వరరావు గౌరవాధ్యక్షులుగా, మార్గదర్శి విద్యా సంస్థ అధినేత శీలం ఆగయ్యా గారు చీఫ్ ప్యాట్రన్‌గా, ఖమ్మ శాసనసభ్యులు తమ్మినేని వీరభద్రం, జనవిజ్ఞాన వేదిక పట్టణ అధ్యక్షులు డా॥ఎ.పట్టాభిరామారావు, మున్సిపల్ ఛైర్‌పర్సన్ శ్రీమతి పడిగే అన్నమ్మ, రైతు సంఘం నాయకులు కాసాని అయిలయ్య, ప్రధాన కార్యదర్శిగా ఎం.సాయిబాబు, ఉపప్రధాన కార్యదర్శులుగా కె.హెచ్.ప్రసాద్, ఎం.వి.అప్పారావు, వి.ఎస్.రావు, కోశాధికారిగా ఎస్.వి.రాఘవులు ఎన్నికైనారు. వీరితో పాటు మరో 150 మంది ప్రముఖులు, కార్మికనేతలు సంఘ నాయకులు ఈ కమిటీలో ఉన్నారు.

# జూట్ కార్మికులకు చిట్టివలస వేతన విధానం అమలు చేయాలి.




గుంటూరులో ఆగస్టు 15,16 తేదీల్లో జూట్ కార్మికుల ప్రథమ రాష్ట్ర మహాసభ జరిగింది. సీనియర్ నాయకులు అల్లూరు పతాకావిష్కరణతో సభ ప్రారంభమయింది. సిఐటియు రాష్ట్ర అధ్యక్షులు సి. హెచ్. నర్సింగరావు ప్రారంభోపన్యాసం చేశారు. పశ్చిమబెంగాల్ శాసనసభ్యులు, బెంగాల్ ఛత్కల్ మజ్దూర్ యూనియన్ కార్యదర్శి రంజిత్‌కుండు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. రాష్ట్ర కమిటీ కన్వీనర్ ఎం. కృష్ణమూర్తి నివేదిక ప్రవేశపెట్టారు.

రాష్ట్రంలోని జూట్ యాజమాన్యాలన్ని నష్టాల సాకు చూపిస్తూ కలిసి కట్టుగా కార్మిక హక్కులపై దాడి చేస్తున్నాయని చర్చలలో ప్రతినిధులు అన్నారు. ఆ వాదాలన్నీ అవాస్తవమని, 74-75లో 264 కేజీల ధర రూ. 2500/- వుంటే ఈ సంవత్సరం రూ. 12000-18000/- ల మధ్యన ఉంది. ఆనాడు గోనెసంచి ధర రూ. 6/- లు వుంటే నేడు రూ. 20/-ల పైనే వుంది. పైగా నేడు యంత్రాల సామర్థ్యం, వేగం కూడా పెరిగాయి. కార్మికుల జీతాలు తగ్గాయి. విదేశీ ఎగుమతులు కూడా బాగా పెరిగాయి.

కేంద్రంలోని యు.పి.ఎ. ప్రభుత్వం పై సిఐటియు, సిపిఎం పెట్టిన వత్తిడి వల్ల నూతన జూట్ ప్యాకేజింగ్ ఆర్డర్ ఇంత వరకు అమలుకు రాలేదు. ప్రస్తుతానికి ఆగిపోయింది. సింథటిక్ బ్యాగ్స్ చూపి ఆర్డర్లు లేవని నమ్మించడానికి యాజమాన్యాలు ప్రయత్నిస్తున్నాయి. ఇది వాస్తవం కాదు. దేశంలో ప్యాకింగ్ పెరిగింది. పెరిగిన మేరకు సింథటిక్ బ్యాగ్స్ వస్తున్నాయి.

జూట్ మిల్లులకు నష్టాలు నిజమైతే మరీ రాష్ట్రంలో జూట్ మిల్లులు ఎందుకు పెరుగుతున్నాయి? 1990లో 13 మిల్లులు ఉంటే నేడు 26కు పెరిగాయి. ఇంకా నిర్మాణానికి ప్రతిపాదనలు జరుగుతున్నాయి. త్వరలో మరో 3,4 మిల్లులు వస్తాయి. 1990లో దాదాపు 25వేల కార్మికులుంటే నేడు 42వేలకు పెరిగారు.

ఒకవైపు పరిశ్రమ లాభాల బాటలో ఉండి విస్తరిస్తుంటే, మరోవైపు కార్మికుల జీతభత్యాలు, సెలవులు, ఇతర హక్కులపై దాడులు పెరుగుతున్నాయి. పనిభారం విపరీతంగా పెరిగింది. అరుణా, ఈస్ట్‌కోస్ట్‌లలో "ఫుల్ రేట్" ఎగిరిపోయింది. తక్కువ జీతాలతో వేల సంఖ్యలో కొత్త వారితో పని చేయిస్తున్నారు. ఇఎస్ఐ, పి.ఎఫ్., సెలవు హక్కులు నిరాకరిస్తున్నారు. యూనియన్ పెట్టుకుంటే బయటికి పొమ్మంటున్నారు.

ఈ నేపథ్యంలో ఈ మహాసభ ద్వారా రాష్ట్రంలో జూట్ వర్కర్స్ ఫెడరేషన్ (సిఐటియు) ఆవిర్భవించింది. గౌరవాధ్యక్షులుగా సి. హెచ్. నర్సింగరావు, అధ్యక్షులు గా ఎం. శ్రీనివాస్, ప్రధాన కార్యదర్శిగా ఎన్. రమేష్, కోశాధికారిగా రెడ్డి శంకర్‌రావు, ఉపాధ్యక్షులుగా ఎం. కృష్ణమూర్తి, సోమయ్య, రెడ్డి వేణు, వి. శేషగిరిరావు, కార్యదర్శులుగా తిరుపతి రావు భావన్నారాయణ, నికల్సన్‌తో నూతన కమిటీ ఎన్నికైంది.

## బెంగాల్ మార్గంలో జూట్ కార్మికులు సంఘటితం కావాలి



ప్రథమ జూట్ మహాసభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న బెంగాల్ శాసనసభ్యులు, బెంగాల్ ఛత్కల్ మజ్దూర్ యూనియన్ కార్యదర్శి రంజిత్‌కుండు సందేశమిస్తూ పశ్చిమబెంగాల్ మార్గంలో ఆంధ్ర జూట్ కార్మికులు సంఘటితం కావాలని కోరారు. పశ్చిమబెంగాల్‌లో ఉన్న 2లక్షల కార్మికుల్లో సిఐటియు లక్షా 50 వేలకు పైగా సభ్యత్వం కలిగి, ఇతర సంఘాలను కలుపుకొని కార్మిక హక్కుల పరిరక్షణకు వీరోచిత పోరాటం చేసింది. బెంగాల్ వామపక్ష ప్రభుత్వంలో కార్మికమంత్రిగా, జూట్ కార్మికుడిగా పని చేసిన అమీన్‌ను నియమించడాన్ని బట్టి జూట్ రంగానికి వామపక్ష ప్రభుత్వం ఇస్తున్న ప్రాధాన్యత అర్థమవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో మిల్లులు వారీగా విడివడి వున్న కార్మిక సంఘాలు రాష్ట్ర వ్యాపితంగా 'ఒకే జీతం-ఒకే విధానం' నినాదాలతో ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి పోరాట పథంలో ముందుకు కదలాలి. పోరాటాలు మాత్రమే కార్మికుల స్థితిగతులను మెరుగు పరుస్తాయి. ఆంధ్ర జూట్ కార్మిక వర్గానికి బెంగాల్ జూట్ కార్మికుల పూర్తి మద్దత్తు, సంఘీభావం ఎల్లప్పుడు ఉంటాయి" అని అన్నారు.

మహాసభ కింది డిమాండ్లను చేసింది.

న్యూ జూట్ ప్యాకింగ్ ఆర్డర్‌ను రద్దు చేయాలి.

కార్మికులందరికి బోనస్ చెల్లించాలి.

చిట్టివలస వేతన విధానం అమలు చేయాలి.

పి.ఎఫ్. పై వడ్డీరేటు 12 శాతానికి పునరుద్ధరించాలి.

పై డిమాండ్ల పై అక్టోబర్ 2న చిట్టివలసలో జూట్ కార్మికుల రాష్ట్ర సదస్సును, శీతకాల శాసనసభ సమావేశాల సందర్భంగా "ఛలో హైదరాబాద్" జరపాలని నిర్ణయించింది.

కేంద్రంలో ఏర్పడిన యు.పి.ఎ. ప్రభుత్వం కార్మికుల సమస్యలను పరిష్కరించాలని కోరుతూ ఆగస్టు 20న "నిరసన దినం" (డిమాండ్స్ డే) జరపాలని కూడా మహాసభ నిర్ణయించింది. ■

# ఇ.పి.ఎఫ్. వడ్డీ రేటు 12%గా ఉండాలి!

**3.95** కోట్లమంది కార్మికులు చెమటోడ్చి కూడబెట్టుకుంటున్న ప్రావిడెంట్ ఫండ్ సొమ్ముపై కేంద్ర ప్రభుత్వం 9.5 శాతంగా ఉన్న వడ్డీరేటు 8.5 శాతానికి తగ్గించింది. ఈ చర్య ద్వారా తన వాగ్దానాన్నే భగ్నం చేసింది. సంప్రదింపులు జరిపి ఇ.పి.ఎఫ్ బోర్డులో కుదిరే అంగీకారం ప్రకారమే వడ్డీ రేటును నిర్ణయిస్తామని ప్రకటించింది. అదే ప్రభుత్వం ఇప్పుడు కార్మిక సంఘాలు వ్యతిరేకిస్తున్నా వడ్డీరేటును తగ్గిస్తూ ప్రకటించింది. ఈ నిర్ణయం ఫలితంగా కార్మికులు రు.1300 కోట్లు నష్టపోతారు.

ప్రభుత్వం కేవలం ఒక వడ్డీ వ్యాపారస్తుడిలా వ్యవహరిస్తున్నది. ఇపిఎఫ్‌ను ఆర్థిక అంశంగా మాత్రమే చూడరాదు. సామాజిక బాధ్యత కూడా కలసి ఉన్నది. పి.ఎఫ్. అంటేనే భవిష్యనిధి. పేరులోనే దాని స్పష్టమైన లక్ష్యం బోధపడుతోంది. అందుకే సంక్షేమ దృక్పథం తో, సామాజిక బాధ్యతా దృష్టితో ఇ.పి.ఎఫ్. వడ్డీరేటును పరిశీలించాలి.

**ఇ.పి.ఎఫ్. పుట్టుక- పరిణామం :** 1952లో పార్లమెంటులో చట్టం చేయడంతో ఇ.పి.ఎఫ్. సంస్థ పుట్టింది. ప్రారంభంలో కేవలం 6 సంస్థలకే ఈ స్కీం వర్తించేది. కార్మికులు, యజమాని చెరి 6.25% వాటా ధనం చెల్లించే వారు. కార్మిక సంఘాల నిరంతర పోరాట ఫలితంగా 20 మంది కంటే ఎక్కువ పని చేసే అన్ని సంస్థలకు ఈ స్కీం అమలులోకి వచ్చింది. కార్మికులు, యజమాని ఇచ్చే వాటా ధనం 10శాతంకు పెరిగింది. సంస్థ ఇచ్చే వడ్డీ క్రమంగా 12శాతం కు పెరిగింది ఇప్పుడు 8.5శాతంకు దించారు. పశ్చిమబెంగాల్ వామపక్ష ప్రభుత్వం ఆ రాష్ట్రంలో ఈ స్కీంను మొత్తం అసంఘటిత —ర్మికులకు వర్తింప చేస్తున్నది.

**ఇ.పి.ఎఫ్ కి బ్యాంకు డిపాజిట్‌కి పోలికే లేదు :** ఇ.పి.ఎఫ్. ఖాతాదారులను, బ్యాంకు డిపాజిటర్లతో పోల్చరాదు. ఒకవ్యక్తి అదనంగా అధిక లాభంకోసం బ్యాంకులో డిపాజిట్ చేస్తాడు. కానీ ఇ.పి.ఎఫ్ ఇందుకు భిన్నమైనది. ఇది సామాజిక భద్రతకు సంబంధించింది. జీవితాంతం కష్టించి, సామాజిక ఉత్పత్తిలో భాగం పంచుకొని ఉద్యోగ విరమణ చేసిన కార్మికుడికి ఆయన కుటుంబానికి ఇదే ఏకైక భద్రతా పథకం. అందుకే వారికి మిగిలే ఏకైక ఆస్తి ప్రావిడెంట్ ఫండ్‌లో దాచిన మొత్తం మాత్రమే.

బ్యాంకులో డిపాజిట్ చేసేవారు వివిధ పథకాల క్రింద 10 రోజుల నుండి 6 సంవత్సరాల వరకు పరిమితకాలం కోసం డబ్బులు చెల్లించి వడ్డీని పొందుతున్నారు. దీనికి భిన్నంగా కార్మికులు ఇ.పి.ఎఫ్. లో 30 నుండి 40 సంవత్సరాలు ప్రతినెల డబ్బును చెల్లిస్తారు. ఆ డబ్బును ప్రభుత్వం తన అవసరాలకు వాడుకుంటున్నది.

బ్యాంకులో డిపాజిట్ చేసే వారికి, ఆ తరువాత వడ్డీరేటు తగ్గినా డిపాజిట్ చేసేటప్పుడు ఉన్న వడ్డీరేటునే చెల్లిస్తారు. ఇ.పి.ఎఫ్. వడ్డీరేట్లు మొదట చేసిన వాగ్దానికి భిన్నంగా తగ్గిస్తున్నారు.

బ్యాంకులో డిపాజిట్ చేసుకోవడం వ్యక్తుల ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉంటుంది. మధ్యలో డిపాజిట్లను ఉపసంహరించుకోవచ్చు కూడా. కాని ఇ.పి.ఎఫ్. మాత్రం అలా కాదు. ఉద్యోగులు తప్పనిసరిగా తమ జీతం నుండి ఇ.పి.ఎఫ్. ఖాతాకు నియమిత మొత్తం జమ చేయాలి. ఇది చట్టబద్ధమైనది. కాదనటానికి కార్మికుడికి స్వేచ్ఛ లేదు. అలాగే మధ్యలో ఉపసంహరించుకోవడానికి వీలుపడదు.

పి.ఎఫ్. ఖాతాలో 29 సంవత్సరాలుగా పోగు పడుతున్న నిధి రు.లక్షా 28వేల కోట్లకు చేరుకున్నది. ఇందులో 75శాతం ప్రభుత్వం తన వద్దనే స్పెషల్ డిపాజిట్ స్కీమ్ (1975) క్రింద ఉంచుకొని నియంత్రిత వడ్డీ విధానం క్రింద కేవలం 8శాతం వడ్డీనే ఇస్తున్నది. ప్రభుత్వం వడ్డీ వ్యాపారిలా చూసినా, పై మొత్తాన్ని కార్మికులు ఇతర బ్యాంకుల్లో డిపాజిట్ చేసి ఉంటే 8 శాతం కంటే ఎక్కువ మొత్తమే వడ్డీగా వచ్చేది. ఇ.పి.ఎఫ్. సొమ్మును ప్రభుత్వం తనకు చౌక వడ్డీకి లభించే వనరుగా మాత్రమే చూడరాదు.

**ఆర్థికశాఖ అత్త పెత్తనం :** ఇ.పి.ఎఫ్. సంస్థకు సెంట్రల్ బోర్డు ఆఫ్ ట్రస్టీస్ (సి.బి.టి) నిర్వాహకులుగా ఉంటారు. సిబిటి ని నామమాత్రం చేసి కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ సంస్థపై అత్తపెత్తనం చేస్తున్నది. 'వడ్డీ ఎంత, ఎవ్వరికి డబ్బులు ఇవ్వాలి' అని ప్రభుత్వం నిర్దేశిస్తున్నది. ఇ.పి.ఎఫ్. సంస్థకు పూర్తి స్వయం ప్రతిపత్తి ఇవ్వాలి. తన నిధులను ఎక్కడ వెచ్చించిస్తే అధిక ఆదాయం వచ్చి, తన సభ్యులకు ఎక్కువ వడ్డీ ఇచ్చేలా అదే నిర్ణయించుకుంటుంది.

లాభాలలో ఉన్న ప్రభుత్వరంగ సంస్థలకు అప్పుగా ఇచ్చి (అవి బ్యాంకుల నుండి 12-14శాతం వడ్డీ ఇచ్చి డబ్బు తీసుకుంటున్నాయి) ఆదాయం పెంచుకునే అవకాశం ఇవ్వాలి. వివిధ సంస్థల నుండి ఇపిఎఫ్ బకాయిలు రూ.1500 కోట్లను వసూలు చేయాలి. అప్పుడే సమస్యకు పరిష్కారం లభిస్తుంది.

**వాధవన్ కమిటీ చెప్పిందేమిటి?** ఈ అంశంపై 1999లో లేబర్ మంత్రిత్వ శాఖ ఎస్.కె.వాధవన్ నాయకత్వంలో టాస్క్‌ఫోర్స్‌ను నియమించింది. ద్రవ్యోల్బణం వల్ల ఇపిఎఫ్ వడ్డీరేటుకు జరిగే నష్టాన్ని భర్తీ చేయాలని పై టాస్క్‌ఫోర్స్ ప్రధాన సిఫార్సు చేసింది. ప్రస్తుతం ద్రవ్యోల్బణం రేటు 7.61శాతంగా ఉంది. ఇ.పి.ఎఫ్. వడ్డీరేటు 8.5శాతానికి తగ్గించాలని ప్రభుత్వం ప్రతిపాదించింది. అంటే ఇపిఎఫ్ కార్మికులకు నికరంగా లభించే వడ్డీ ఒక శాతం కంటే తక్కువే. ఈ నష్టాన్ని పూడ్చేందుకే వడ్డీరేటు 12 శాతంగా ఉంచాలని కార్మిక సంఘాలు, లెఫ్ట్ పార్టీలు కోరుతున్నాయి.

**కార్మిక సంఘాల పాత్ర:** వడ్డీరేటు తగ్గింపుకు అనుకూలంగా ఐఎన్‌టియుసి ఓటు చేసింది. ఎన్‌డిఏ ప్రభుత్వం హయాంలోనే వడ్డీరేటు 8శాతం తగ్గింపుకు నిర్ణయం జరిగింది. అప్పుడు పల్లెత్తు మాట అనని బిఎంఎస్ వారు ఈరోజు వడ్డీరేటు తగ్గింపును వ్యతిరేకిస్తున్నారు. ఇది పచ్చి అవకాశవాదం. సిఐటియు, ఏఐటియుసి లాంటి సంఘాలు వడ్డీరేటు తగ్గింపును ఆది నుండీ గట్టిగా వ్యతిరేకిస్తున్నాయి.

**ప్రభుత్వం తన మాటకు కట్టుబడాలి :** సిఎంపిలో ప్రావిడెంట్ ఫండ్ వడ్డీ గురించి కేంద్ర ప్రభుత్వం సానుకూలంగా హామీ ఇచ్చింది. గ్లోబల్ ట్రస్ట్ బ్యాంకులో రు.535 కోట్ల మొండి బాకీలను ప్రభుత్వమే రద్దు చేసింది. బడ్జెట్‌లో స్టాక్ మార్కెట్ లావా దేవీలపై సర్వీస్ పన్ను విధించి బ్రోకర్స్ గగ్గోలు పెట్టగానే ఆ పన్నును రూ.6000 కోట్లు తగ్గించింది. ఎన్‌డిఏ ప్రభుత్వం గతంలో పెట్టుబడిదారులకు బడ్జెట్‌లో రూ.50 వేల కోట్లు రాయితీలు ఇచ్చింది. రు.25వేల కోట్లు సబ్సిడీతో కూడిన అప్పుగా బట్టల మిల్లుల వారికి కట్టబెట్టారు. రు.1.53 లక్షల కోట్లు కంపెనీ యజమాన్యాలు, సంపన్నుల పన్నుల బకాయిలు వసూలు చేయకుండా వదిలేశారు. పై ఉదాహరణలు అతి స్వల్ప మందికి వర్తించేవి. కావున ప్రభుత్వం ఇప్పటికైన జోక్యం చేసుకుని 3.95 కోట్ల మందికి లాభం చేకూర్చే విధంగా ఇ.పి.ఎఫ్. వడ్డీని 12శాతంగా ప్రకటించాలి. ■

# విస్తృత ఆందోళనలతో దిగివచ్చిన యం.సి.హెచ్.

హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్ కాంట్రాక్ట్ కార్మికులకు కనీసవేతనం రూ.2220/-లు అమలు చెయ్యాలని గత రెండున్నర ఏళ్ళుగా నిరంతరాయంగా ఎం.సి.హెచ్. ఎంప్లాయీస్ యూనియన్ (సి.ఐ.టి.యు.) పోరాడుతున్న విషయం తెలిసిందే. ఇన్నేళ్ళపాటు చేసిన ఆందోళనా ఫలితంగా నగరంలో అత్యధిక మందికి రూ.1800/-లు చెల్లిస్తున్నారు. ఇతర చట్టబద్ధ సౌకర్యాలు కూడా అమలు జరగడంలేదు. కనీసవేతనాల కోసం నిరంతరం ఆందోళన చేస్తున్నారనే ఉక్రోషంతో ఉన్న కాంట్రాక్టర్లు కార్మికులను తొలగిస్తున్నారు. ఈ నేపథ్యంలో రాష్ట్ర ప్రభుత్వాన్ని, అధికార యంత్రాంగాన్ని కదిలించడానికి ఆగస్ట్ 16-27 వరకు విస్తృత ఆందోళనను చేపట్టారు. ఫలితంగా కమీషనర్, అడిషనల్ కమీషనర్ ఇతర యంత్రాంగం న్యాయమైన కోర్కెల అమలు కోసం కృషి చేస్తామని అంగీకరించారు. దీంతో ఆందోళనను తాత్కాలికంగా విరమించారు.

**(2) అన్నింటా అడ్డంకిగా ఎం.సి.హెచ్. యాజమాన్యం :** కనీస వేతనాల కోసం నిరంతరం ఆందోళన చేస్తున్నందున సి.ఐ.టి.యు. అధికారులకు కంటగింపు అయ్యింది. 2002లో అప్పటి ఎం.సి.హెచ్. కమీషనర్ పి.కె. మహంతి, నగర పాలక సంస్థ సేవలు నిరంతరాయంగా, సమర్ధవంతంగా ఉండాలన్న సాకుతో కాంట్రాక్ట్ కార్మికులను కాంట్రాక్ట్ వర్కర్స్ & అబాలిషన్ యాక్ట్ (1970) నుండి మినహాయించాలని రాష్ట్ర ప్రభుత్వం నుండి ప్రత్యేక అనుమతిని కోరి, పొందారు. వీరికి కనీస వేతనాలు, ఇతర చట్టబద్ధ సౌకర్యాలు వర్తించకూడదన్నది దీని సారాంశం. 2003 లో కూడా ప్రత్యేక అనుమతి పొందారు.

అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం మహంతికి అండగా నిలిచి కాంట్రాక్ట్ కార్మికులను నిలువునా ముంచేసింది. 2004లో ఇదే అనుమతి కోసం కార్మికశాఖకు ఎం.సి.హెచ్. లెటర్ పంపారు.

దీనిని ఆపాలని సి.ఐ.టి.యు. నాయకత్వం మున్సిపల్ శాఖా మంత్రిని, లేబర్ కమీషనర్‌లను కలిసి వినతి పత్రం అందజేసింది. సి.ఐ.టి.యు. రాష్ట్ర ఉపాధ్యక్షులు, కర్నూల్ సి.పి.ఐ.(ఎం) శాసన సభ్యులైన కా॥ ఎం.ఎ. గఫూర్ కార్మికశాఖా మంత్రిని కలిసి ప్రత్యేక అనుమతిని నిలుపుదల చేయాలని కోరారు. దీంతో మంత్రి స్పందిస్తూ ఈ అంశంపై ఎం.సి.హెచ్. లో ఉన్న కార్మిక సంఘాలతో చర్చించి నిర్ణయం తీసుకుంటామని హామీ నిచ్చారు.

**(3) విస్తృత ఆందోళన కృషి :** రాష్ట్రంలో ఏర్పడిన కొత్త ప్రభుత్వం కనీసవేతనాల అమలు కోసం ప్రత్యేక శ్రద్ధ పెట్టాలని అసెంబ్లీలో మున్సిపల్ శాఖా మాత్యులను కలిసి వివరించారు. లేబర్ కమీషనర్, ఎం.సి.హెచ్. కమీషనర్‌లకు వినతి పత్రాలు అందజేశారు. యధాలాపంగా పరిశీలిస్తామని సమాధానం వచ్చిందే తప్ప నిర్దిష్ట చర్యల గురించి ప్రకటించలేదు. అన్ని వైపుల నుండి వత్తిడి తెస్తేతప్ప అధికార యంత్రాంగంలో మార్పు రాదని విస్తృత ఆందోళనకు నిర్ణయించారు.

కార్మికశాఖ కార్యాలయం వద్ద, పి.ఎఫ్., ఇ.ఎస్.ఐ. ఆఫీస్‌ల వద్ద ధర్నాలు, చివరిగా ఎం.సి.హెచ్. ముట్టడి కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. మొత్తం మీద 2 వేల మందికి పైగా కార్మికులు ఉత్సాహంగా ఈ ఆందోళనలో పాల్గొన్నారు. ఎం.సి.హెచ్. సంస్థ నిర్వాకాన్ని పత్రికలు తీవ్రంగా ఎండగట్టాయి. ఆందోళనా కార్యక్రమాలు జరుపుతూనే, మరోప్రక్క ఎం.సి.హెచ్. కమీషనర్‌తో చర్చలకు ప్రయత్నించారు. కార్మికశాఖ, ఇ.ఎస్.ఐ., పి.ఎఫ్. శాఖల నుండి వచ్చిన వత్తిడి, కార్మికుల ఆందోళనను గమనించిన కమీషనర్ ఎం.సి.హెచ్. ముట్టడికి ముందురోజు అంటే ఆగస్ట్ 26న నాయకులను చర్చలకు ఆహ్వానించారు. ప్రధానమైన 4 కోర్కెలను అమలు చెయ్యడానికి సూత్ర ప్రాయంగా ఆమోదం తెలిపారు. కార్మికుల కోర్కెల పట్ల సానుకూలంగా ఉన్నందున ఆగస్ట్ 27 న ఎం.సి.హెచ్. ముట్టడి కార్యక్రమాన్ని విరమించాలని కమీషనర్ కోరారు. ఆందోళనను యధాతధంగా కొనసాగిస్తామని, తమకు చెప్పిన విషయాలను ఎం.సి.హెచ్. తరపున కార్మికులకు తెలియచెయ్యమని కోరడంతో అయిష్టంగా అంగీకరించారు.

**(4) ఆమోదించిన కోర్కెలు :** (1) కనీసవేతనం రూ.2220లు చెక్కు రూపంలో చెల్లిస్తామని, (2) ఇ.ఎస్.ఐ., పి.ఎఫ్. వంటి చట్టబద్ధ సౌకర్యాలు వర్తింపచేస్తామని, (3) వారాంతపు శెలవుకు సంబంధించి చట్టప్రకారం పరిశీలించి అమలుకు కృషి చేస్తామని చెప్పారు.

నగరంలో ఉన్న 8 వేల మంది కార్మికులకు అకౌం పేయి చెక్కులు యివ్వడానికి బ్యాంకులు ముందుకు రావడంలేదని, కార్మికులతో వ్యక్తిగత ఖాతాలు తెరిపిస్తే ఎకౌంట్ పేయీ చెక్కులు ఇస్తామని చెప్పారు. అలా మీకు వీలు కానిపక్షంలో కాంట్రాక్టర్లు 160 మంది పేర్లతో సేవింగ్స్ బ్యాంక్ ఎకౌంట్లు తెరుస్తామని, జీతాలు సంస్థ తరపున బ్యాంకులో జమచేస్తామని, ప్రతినెల విత్‌డ్రాయల్ ఫారంను కాంట్రాక్టర్లు కార్మికులకు అందజేస్తారని, సంబంధిత కార్మికుడు నేరుగా బ్యాంకు నుండి సొమ్ము తీసుకునే అవకాశం ఉంటుందని చెప్పారు. దానిని సెప్టెంబర్ నెలలో చెల్లించే జీతాల నుండి అమలు చేస్తామని హామీ ఇచ్చారు. పి.ఎఫ్., ఇ.ఎస్.ఐ. లాంటి సౌకర్యాల కోసం ఆ సంస్థల అధికారులతో చర్చించి 2004 నవంబర్‌లో ప్రకటించే కొత్త టెండర్ షరతులలో పొందుపరుస్తామని హామీనిచ్చారు.

**(5) ముగింపు :** ప్రస్తుతం ఆమోదించిన అంశాలు ఆచరణలో నిలబెట్టుకుంటారని ఆశిస్తున్నాము. ప్రభుత్వాలు మారినా అధికార యంత్రాంగంలో మార్పు రాలేదని ఎం.సి.హెచ్. సంస్థ అధికారుల వైఖరి బట్టి స్పష్టమవుతుంది. కావున ఈ విస్తృత ఆందోళన అధికార యంత్రాంగాన్ని తాత్కాలికంగా కదిలించిందనడంలో సందేహంలేదు. ఇచ్చిన హామీని నిలబెట్టు కోని పక్షంలో మరింత సమరశీలమైన ఉద్యమాన్ని చేపట్టాలి. పోరాటాల ద్వారానే సమస్య పూర్తిగా పరిష్కారం సాధ్యమవుతుందని అనుభవం నేర్పిన పాఠం.

– జె. వెంకటేష్

# మురికి వాడ తిరగబడింది




పది రోజుల క్రితం మహారాష్ట్రలోని నాగపూర్‌లో ఒక ఘటన జరిగింది. కొంత మంది మహిళలు ఒక పేరు మోసిన రౌడీని మెజిస్ట్రేట్ కోర్టు దగ్గరే రాళ్ళతో కొట్టి చంపేశారు.

రౌడీని కొట్టి చంపిన మహిళలు ఒక గుర్తింపు, గ్లామరు,చదువుసంధ్యలులేని చాలా సీదాసాదా మహిళలు. పైగా వాళ్ళుండేది ఒక మురికివాడలో. మీడియా పెద్దగా దృష్టి పెట్టకపోవడానికి ఇవే కారణాలని చెప్పడం లేదు.

నిజానికి తరచి చూసిన కొద్దీ ఈ ఘటనలో చాలా లోతులు కనిపిస్తాయి. అనేక కోణాల నుంచి అనేక ప్రశ్నలు తలెత్తుతాయి. రాజ్యాంగం, ప్రభుత్వాలు, చట్టాలు, కోర్టులు, మొత్తం వ్యవస్థ అంతా నిరుత్తరంగా నిలబడవలసి వస్తుంది. వ్యవస్థనే ఇలా నిరుత్తరంగా నిలబెట్టడం ఆషామాషీ విషయం కాదు. ఇటువంటిది చాలా అరుదుగా ఎదురయ్యే అనుభవం. ఈ ఘటనపై తీర్పు చెప్పడానికి మనకు తెలిసిన మాట లేవీ సరిపోవు. ఆ విధంగా ఈ ఘటన ముందు 'భాష' కూడా మూగవోయే పరిస్థితి.

అక్కూయాదవ్ అనే ఆ రౌడీ నాగపూర్‌లోని కస్తూర్బానగర్ మురికివాడను గత పదేళ్ళుగా అక్షరాలా ఏలుకుంటున్నాడు. మహిళలపై అత్యాచారాలతో సహా అతడు చేయని నేరం లేదట. అతనిపై పోలీసులు మొత్తం 24 కేసులు నమోదు చేశారు. ఏ ఒక్క కేసులోనూ విచారణ జరగలేదు. ఎంత పెద్దనేరం చేసి అరెస్టయినా వెంటనే బెయిలు మీద విడుదలైపోతున్నాడు. ఇలాగే ఆగస్టు 13న వేరొక ఆరోపణపై కోర్టుకు వెడుతూ, బెయిల్ మీద రాగానే మీ అంతు చూస్తానని మురికివాడ మహిళలను బెదిరించాడు. అతడు బెయిలు మీద రావడం, అన్నంతపనీ చేయడం ఖాయమని ఆ మహిళలకు బాగా తెలుసు. ఆ రౌడీబారి నుంచి తమను రక్షించే వ్యవస్థ ఏదీ వారికి లేదు. తమను తామే రక్షించుకోవాలనుకున్నారు. సామూహికంగా వెళ్ళి కోర్టు దగ్గర అక్కూ యాదవ్‌ను రాళ్ళతో కొట్టి చంపేశారు. వీరిలో ఒక అరవై ఏళ్ళ వృద్ధ మహిళ కూడా ఉండడం విశేషం. ఈ వృద్ధ మహిళతో సహా అయిదుగురిని పోలీసులు నిర్బంధంలోకి తీసుకుని మెజిస్ట్రేట్ వద్ద హాజరుపరచగా ఆయన వాళ్ళను జుడిషియల్ కస్టడీకి పంపించారు.

దీనికి వ్యతిరేకంగా మురికివాడ మహిళందరూ ఆందోళన ప్రారంభించారు. నాగపూర్‌లోని పలువురు ప్రముఖుల నుంచి సంస్థల నుంచి ఈ మహిళలకు మద్దతు లభించింది. వందమందికి పైగా న్యాయవాదులు వీరి తరఫున వాదించడానికి ముందుకొచ్చారు. కొందరు సీనియర్ న్యాయవాదులు వీరికోసం బెయిల్ దరఖాస్తులు దాఖలు చేశారు. పోలీసులకు పరిస్థితి అర్థమయ్యింది. ప్రాసిక్యూషన్ వారు బెయిల్‌కు అభ్యంతరం చెప్పబోమన్నారు. మెజిస్ట్రేట్ వారికి బెయిల్ మంజూరు చేశారు. విడుదలైన మహిళలకు నగరమంతా బ్రహ్మరథం పట్టింది. ఈ సందర్భంగా వారు చేసిన ఓ హెచ్చరిక 'రౌడీలను ఇంకా చంపుతాం'. ఈ మహిళలు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోగలిగినంత ధనబలం, కండబలం ఉన్నవాళ్ళు కాదు. చదువుసంధ్యలు లేనిపేద మహిళలు. చట్టం నడిరోడ్డు మీద దిక్కులేని అనాథలా పడి ఉంటే తప్ప, పోలీసులు చేతుల్లోంచి దానిని ఒడిసి గుంజుకునేంత శక్తికానీ, తెలివిగానీ వీళ్ళకు లేదు. అసలా పరిసరాల్లో చట్టమేదీ లేని స్థితిలో చావుభయంతో వీళ్ళు తామే ఒక చట్టాన్ని సృష్టించుకుని అమలుపరిచారు. అలాగని దీనిని 'ఆత్మరక్షణ' కింద నిరూపిద్దామంటే అదీ కుదరదు. ఎందుకంటే, అక్కూ యాదవ్ పదేళ్ళుగా వీళ్ళను పీక్కుతింటున్నాడనిగానీ, అతని వల్ల వీళ్ళకు ప్రాణభయం ఉందని కానీ నిరూపించడానికి 'సాక్ష్యాలు' ఏవీ లేవు. ఇక అక్కడ 'రాచక'మనేది ఏదైనా ఉంటేనే దీనిని 'అరాచకం' అనచ్చు. ఉన్నదంతా అరాచకమే అయినప్పుడు, ఒక పెద్ద అరాచకంలో ఇది చిన్న అరాచకం అవుతుంది. కనుక వీళ్ళకు 'శిక్ష' అమలుపరచే అవకాశం లేదు.

భారత శిక్షాస్మృతిలోని ఏ సెక్షన్ కింద, ఏ క్లాజు కింద వీరిని శిక్షించాలో, అసలు వీరి చర్యను ఏ మాటతో వర్ణించాలో అటు న్యాయశాస్త్ర కోవిదులకూ, ఇటు భాషాపండితులకూ కూడా ఒక పెద్ద చిక్కు ప్రశ్న. వ్యవస్థతోపాటు, భాషను, నిఘంటువులనూ కూడా మూగవోయేలా చేస్తున్న ఈ ఘటన ఏమాత్రమూ ఒక సాధారణ ఘటనగా కనిపించడం లేదు.

ఇంకో విచిత్రం... ఈ మహిళల చర్యకు నాగపూర్ పట్టణ వాసులందరూ మద్దతు తెలపడం! రేపు మొత్తం దేశమే ఒక నాగపూర్ అయితే?! అలా పోటెత్తిన జనసముద్రంలో మన రాజ్యాంగమూ, ప్రభుత్వాలు, చట్టాలు కొట్టుకుపోతే...?!

పోనీ ఇంతటి సువిశాల భారతావనిలో నాగపూర్ అనే పట్టణంలోని ఓ మురికివాడలో, అక్కడి పరిస్థితుల దృష్ట్యా సంభవించిన అత్యంత అరుదైన ఒక ఘటనగా పేర్కొని మన వ్యవస్థకు భరోసా ఇద్దామంటే అందుకూ అవకాశం కనిపించడం లేదు. ఎందుకంటే, ప్రతిచోటా రౌడీలు, పోలీసులు ఉన్నారు. మురికివాడలూ ఉన్నాయి, మహిళలూ ఉన్నారు. ఆ రౌడీల మీద పోలీసుల కేసులూ, సాక్ష్యాలు లేక వీగిపోవడాలూ, న్యాయస్థానాలలో బెయిళ్ల మంజూరు- ఇవన్నీ ఉన్నాయి. రౌడీలు, గూండాలు జైల్లో ఉండే రోజుల కన్నా, బెయిలు మీద ఉండే రోజులే ఎక్కువగా ఉంటాయి. మన రాష్ట్రాన్నే తీసుకుంటే నేరస్థులపై దాఖలైన కేసుల్లో పాతిక శాతం కేసుల్లోనే ఆరోపణలు రుజువై శిక్ష పడిన 'క్రిమినల్ జస్టిస్' చరిత్ర మన ఎదురుగా ఉంది. దీనిని ఏదో ఒక చెదురుమదురు ఘటనగా భావించుకుని గుండెమీద చేయి వేసుకుని నిద్రపోదామన్నా వీలుకాని పరిస్థితి!

ఇది మిగిలిన వారందరికంటే కూడా నాగపూర్ పోలీసులకూ, కోర్టులకూ తమ ఉనికిని మరింతగా నిరూపించుకోవలసిన గడ్డు సమస్య. వ్యవస్థను కాపాడే యత్నంలో చివరకు పోలీసులే ముందుడుగు వేశారు. అక్కూయాదవ్ హత్య వెనుక ప్రత్యర్థి రౌడీ గ్యాంగ్ ఉందని, ఈ మహిళలను ఈ గ్యాంగ్ ముసుగుగా వాడుకుందని పోలీసులు తాజా కథనం. ఇది బొత్తిగా అతకని అబద్ధమని తెలిసిపోతూనే ఉంది. ఒక అబద్ధంతో ఇంత పెద్ద చట్టబద్ధ వ్యవస్థను కాపాడడం వ్యవస్థకు పరువు కాదు. అదీగాక అంత పెద్ద బాధ్యతను పోలీసుల చిన్న బుర్రలకే వదిలిపెట్టడం కూడా న్యాయం కాదు. అఖిల భారత స్థాయిలో తలపండిన సుప్రసిద్ధన్యాయశాస్త్ర నిపుణులు రంగప్రవేశం చేసి, ఈ చిక్కు సమస్యను పరిష్కరించి 'వ్యవస్థ'ను ఎలా నిలబెడతారన్నది ఒక పెద్ద సవాలు!

■

# కుడి ఎడమల దగా దగా



ప్రపంచబ్యాంకు ఆదేశాలకు లోబడి ప్రభుత్వశాఖల్లో ఖాళీగా ఉన్న రెండున్నర లక్షల ఉద్యోగాలను భర్తీ చేయకుండా గత చంద్రబాబు ప్రభుత్వం నిరుద్యోగ యువతను నిరాశా నిస్పృహలకు లోను చేసింది. కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం కూడా ఖాళీ పోస్టులను భర్తీ చేయ్యకుండా, ఉన్న ఉద్యోగులను కుదించడానికి అనేక కుటిల ప్రయత్నాలు చేసింది. భర్తీ చేసిన కొద్ది నియామకాలను కాంట్రాక్టు పద్ధతిలోనే చేసారు. గత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఖాళీగా ఉన్న పోస్టులను రద్దు చేసి, అసలు ఖాళీలే లేనట్లుగా నమ్మించేందుకు నిస్సిగ్గుగా ప్రయత్నాలు చేశాయి. అందుకే రైల్వేలలో ఖాళీగా ఉన్న 38,000 కలాసి పోస్టులకు అర్హత 8వ తరగతైనా గ్రాడ్యుయేట్లు, పోస్టుగ్రాడ్యుయేట్లు 75లక్షల మంది దరఖాస్తు చేశారు.

### ఉద్యోగ భద్రత

ఉద్యోగులకు ఉద్యోగభద్రత ఉంటే సరిగా పని చేయరనేది చంద్రబాబు సిద్ధాంతం. ఉద్యోగభద్రత లేకుండా చేసి, ఉద్యోగుల చేత వెట్టిచాకిరి చేయించడానికి గత చంద్రబాబు ప్రభుత్వం కాంట్రాక్టు విధానాన్ని విచ్చలవిడిగా ప్రవేశపెట్టింది. లక్షలాది మంది యువకులను చాలీచాలని వేతనాలతో, ఎటువంటి భద్రత లేకుండా ప్రభుత్వంలోని అన్ని శాఖలలో కాంట్రాక్టు పద్ధతిపై నియామకాలు చేసింది. ఆ వేతనాలు కూడా నెల, నెలా చెల్లించక కాంట్రాక్టు ఉద్యోగులను అనేక ఇక్కట్ల పాల్చేశారు. అనేక శాఖల్లో థర్డ్‌పార్టీ ద్వారా కూడా కాంట్రాక్టు నియామకాలు చేసి, వారి జీతాల నుండి 15-20శాతం వేతనాన్ని కాంట్రాక్టర్లకు చెల్లించారు. అమెరికా వంటి దేశాలలో ఉద్యోగ భద్రత లేదని అందుకే ఆదేశం బాగా అభివృద్ధి చెందిందంటూ అక్కడి హైర్ & ఫైర్ విధానాన్ని ఇక్కడకు తీసుకొచ్చారు. ఏడాది లేదా 2 ఏళ్ళు పని చేయించుకొని ఉద్యోగాల నుండి తొలగించడమే ఈ విధానం. ఈ విధానం ద్వారా ప్రస్తుతం పని చేస్తున్న ఉద్యోగుల సంఘటిత శక్తిని కూడా నాశనం చేయడమే ప్రభుత్వ కుటిల రాజకీయం. దీన్ని పర్మినెంటు ఉద్యోగులందరూ గమనించాలి. కాంట్రాక్టు ఉద్యోగులను పర్మినెంట్ చేయాలనే ఆందోళనలో పర్మినెంట్ ఉద్యోగులు కూడా పాలు పంచుకోవాలి.

### కాంగ్రెస్ హామీలు నిలబెట్టుకోవాలి

ఎన్నికల ముందు కాంట్రాక్టు ఉద్యోగులను పర్మినెంట్ చేస్తామని, వివిధ శాఖల్లో ఖాళీగా ఉన్న పోస్టులను భర్తీ చేస్తామని హామి ఇచ్చిన కాంగ్రెస్ అధికారం చేపట్టి 4 నెలలయినా కాంట్రాక్టు ఉద్యోగుల సమస్యలను పరిష్కరించలేదు. అంతేకాక ఖాళీలను శాశ్వత ప్రాదిపదికపై భర్తీ చేస్తామని ఒకసారి, కాంట్రాక్టు నియామకాలు కూడా చేపడతామని మరోసారి, నెలనెలా సక్రమంగా కాంట్రాక్టు ఉద్యోగులకు వేతనాలు చెల్లిస్తామంటూ ప్రకటనలిచ్చారు. మరొక ప్రక్క వ్యవసాయ శాఖల్లో పని చేస్తున్న వారిని తొలగిస్తామంటూ వ్యవసాయ శాఖ మంత్రి పొంతనలేని ప్రకటనలిస్తున్నారు. మరికొంత మంది కాంగ్రెస్ నాయకులు కాంట్రాక్టు ఉద్యోగులందరూ తెలుగుదేశ కార్యకర్తలంటూ వారి సమస్యల పట్ల నిర్లక్ష్య వైఖరినవలంబిస్తున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా 28 శాఖల్లో 2 లక్షల మంది కాంట్రాక్టు ఉద్యోగులుండగా కేవలం 21వేల మంది ఉన్నారని సాక్షాత్తూ మంత్రే అసెంబ్లీలో ప్రకటించడం అత్యంత దారుణం. కాని కాంట్రాక్టు ఉద్యోగులందరూ ప్రజలకు సేవలందించడానికే ఉద్యోగాలలో చేరారని, శాశ్వత ప్రాతిపదికన అనేక సంవత్సరాలుగా నియామకాలు లేనందుకే కాంట్రాక్టు ఉద్యోగాలలో చేరారనే విషయాన్ని కాంగ్రెస్ ప్రభుత్వం గుర్తిస్తే మంచిది. గత ప్రభుత్వం ప్రజా, ఉద్యోగ వ్యతిరేక విధానాలను అవలంబించడం వల్లే వారిని గద్దె దించారన్న నిజాన్ని గ్రహించి, సరైన విధానం తీసుకోవడం కాంగ్రెస్ వారికే మంచిది.

### అంతులేని దోపిడీ

శాశ్వత స్వభావం కలిగిన పనులలో కాంట్రాక్టు నియామకాలు జరపరాదని కాంట్రాక్టు లేబరు చట్టం చెప్తున్నా, దానిని తుంగలో త్రొక్కి కాంట్రాక్టు నియమాకాలు జరిపారు. కాంట్రాక్టు ఉద్యోగులకు సెలవులు ఇవ్వకుండా, మహిళా ఉద్యోగులకు ప్రసూతి సెలవులు ఇవ్వకుండా, అతి తక్కువ వేతనాలతో ప్రభుత్వం అత్యంత దారుణంగా దోపిడీ చేస్తోంది. ఆదర్శ యాజమాన్యంగా నిలబడాల్సిన ప్రభుత్వమే ఈ విధంగా వ్యవహరించడం వల్లనే ప్రైవేటు యాజమాన్యాలు తెలుగుదేశ ప్రభుత్వ వత్తాసుతో కార్మికులకు ఎటువంటి భద్రతా కల్పించకుండా, చట్టాలను ఉల్లంఘించి లాభాలు పెంచుకున్నాయి. ప్రస్తుత కాంగ్రెస్ ప్రభుత్వం అటువంటి విధానాలను సరిచేసి వ్యవహరించాల్సి వుంది. అధికారులు కూడా కాంట్రాక్టు ఉద్యోగులను ఉద్యోగాల నుండి తీసేస్తామంటూ భయాందోళనకు గురి చేస్తూ మనఃశాంతి లేకుండా చేస్తున్నారు.

### ప్రభుత్వ కాంట్రాక్టు ఉద్యోగులు

రాష్ట్ర ప్రభుత్వంలో మొత్తంగా 3లక్షల 75వేల మంది కాంట్రాక్టు పద్ధతిపై పని చేస్తున్నారు. వీరిలో (1) రాష్ట్ర ప్రభుత్వంలోని 28 శాఖల్లో 2 లక్షల మంది కాంట్రాక్టు ఉద్యోగులుగా, (2) లక్షమంది రాష్ట్ర ప్రభుత్వం లోని వివిధ కార్పొరేషన్లలో, యూనివర్శిటీలలో, హాస్టల్స్‌లో, ఫారెస్టు డిపార్టుమెంట్స్ తదితర శాఖల్లో ఎన్ఎంఆర్, కంటింజెంట్, డైలీవేజ్ వర్కర్లు, (3) మరో 75వేల మంది పంచాయితీ, మున్సిపాలిటీ, ఎలక్ట్రిసిటి తదితర శాఖల్లో కాంట్రాక్టు కార్మికులుగా పని చేస్తున్నారు. కాంట్రాక్టు పద్ధతిపై పని చేస్తున్న వారిలో అత్యధికులు శాశ్వత స్వభావంగల పనిలోనే ఉన్నారు.

### వివిధ శాఖల్లో కట్టుబానిసలు

రాష్ట్ర ప్రభుత్వంలోని 28 శాఖల్లో పని చేస్తున్న 2 లక్షల మంది కాంట్రాక్టు ఉద్యోగులలో 90వేల మంది విద్యా వాలంటీర్లుగా, స్పెషల్ విద్యా వాలంటీర్లుగా, మండల రిసోర్సు టీచర్లు, నిరంతర విద్యా ప్రేరకులుగా, బాలజ్యోతి టీచర్లుగా, తదితర కేటగిరీల్లో ప్రాథమిక విద్యాశాఖలో పని చేస్తున్నారు. ఉన్నత విద్యాశాఖలో 20వేల మంది కాంట్రాక్టు లెక్చరర్లుగా, ఒకేషనల్ పార్ట్‌టైమ్ లెక్చరర్లు, ఇతర కేటగిరీల్లో పని చేస్తున్నారు. సాంకేతిక విద్యాశాఖలో పాలిటెక్నిక్ కాంట్రాక్టు లెక్చరర్లు తదితర కేటగిరీల్లో 5వేల మంది పని చేస్తున్నారు. వ్యవసాయ శాఖలో

అత్యుత్తమ బోధన

కృష్ణా పుష్కర శుభాకాంక్షలతో ....

అద్భుత ఫలితాలు




# శ్రీ పూజిత పబ్లిక్ స్కూలు

(Run by Kancharla Punnamma Educational Society) (Recognised by Govt. of A.P.)

"శ్రీ పూజిత మీ చిన్నారుల ఉజ్వల భవిత" "ప్రజ్ఞా విజ్ఞానముల మేటి ప్రదాత"

| జూబ్లి హిల్స్, హైదరాబాద్ | కూకట్‌పల్లి, హైదరాబాద్ | గుంటూరు |
|---|---|---|
| Ph : 040 - 23541398 | Ph : 040 - 23055692 | Ph : 0863 - 2359755 |

- తెలుగు మరియు ఇంగ్లీష్ మీడియం (డే & రెసిడెన్షియల్)
- CBSE మరియు స్టేట్ సిలబస్
- నర్సరీ నుండి 10th క్లాసు వరకు

కో-ఎడ్యుకేషన్












- మీ చిన్నారుల గురించి మీరు కన్న కలలకు వాస్తవరూపము కల్పించగల మహోన్నతమైన విద్యా సంస్థ శ్రీ పూజిత పబ్లిక్ స్కూల్.
- ఇంగ్లీషు గ్రామరు మరియు కాన్వర్‌సేషన్ యందు ప్రాధాన్యత నిచ్చి, ప్రతి విద్యార్ధిచే ధారాళముగా ఇంగ్లీషులో మాట్లాడించుట.
- నాట్యము, యోగా, చిత్రలేఖనము మరియు కరాటే మొ॥ వానిలో ఉత్తమమైన శిక్షణ.
- మానసిక వికాసము, మంచి క్రమశిక్షణ మొ॥ వానితో మీ బిడ్డలను బాధ్యత గల ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దుట.
- అనుభవజ్ఞులు, అంకితభావము, పరిపూర్ణ అర్హతగల ఉపాధ్యాయులచే నూతన విధానములతో విద్యాబోధన.
- వెనుకబడిన విద్యార్థులపై ప్రత్యేక శ్రద్ధ. వారి కొరకు ప్రత్యేకమైన బోధనాపద్ధతులు పాటించుట.
- ప్రశాంత వాతావణములో విశాలమైన తరగతి గదులు, పెద్ద ఆటస్థలము చక్కని వసతులు గల విద్యా సంస్థ.
- సమగ్రమైన లైబ్రరీ మరియు సైన్సు లేబరేటరీ ●హాస్టల్ వసతి కలదు.











16A

# మంగళగిరి పురపాలక సంఘము

## పుష్కర కృష్ణ సందర్భముగా ముస్తాబైన 'మంగళగిరి'

| | | | |
|---|---|---|---|
| మురుగుడు హనుమంతరావు<br>ఎం.ఎల్.ఏ. | కాండ్రు కమల<br>ఛైర్‌పర్సన్ | అందె నరసింహారావు<br>వైస్ ఛైర్మన్ | కె. సహదేవరావు<br>కమీషనర్ |

'పుష్కర కృష్ణ'కు ప్రధానమైన విజయవాడ నగరమునకు కేవలము 10 కిలోమీటర్ల దూరమున గల 'మంగళగిరి శ్రీ పానకాల లక్ష్మీ నరసింహస్వామి' వారిని దర్శించి, తరించుటకు, అధిక సంఖ్యలలో వేంచేయు పుష్కర యాత్రికులకై 'మంగళగిరి పురపాలక సంఘము' తగిన సౌకర్యములు ఏర్పాటు చేసియున్నది.

సదరు సౌకర్యములు కల్పించుటకై ప్రభుత్వము వారు రూ.2.00 కోట్ల రూపాయలు మంగళగిరి పురపాలక సంఘమునకు మంజూరు చేసియున్నారు.

**పుష్కర నిధులతో :**

- మంగళగిరి మునిసిపల్ ఏరియాలో రూ.109.50 లక్షల రూపాయలతో పక్కా సిమెంట్ రోడ్ల నిర్మాణము.
- రూ.13.00 లక్షలతో ప్రధాన రహదారి యందు 'సెంట్రల్ డివైడరు' నిర్మాణము.
- రూ.24.00 లక్షల రూపాయలతో 'హైమాస్టు లైటింగ్, సెంట్రల్ డివైడరు లైటింగ్, దేవస్థానం చుట్టూ సోడియం వేపర్ ల్యాంపుల ఏర్పాటు.
- పారిశుద్యమునకు అత్యధిక ప్రాధాన్యత. సుమారు రూ.32.00 లక్షలు కేటాయింపు.
- త్రాగునీటి సరఫరాకై రూ. 6.50 లక్షలు వెచ్చింపు.
- ఆరోగ్య కేంద్రములు ఏర్పాటు రూ.2.00 లక్షల రూపాయలతో పుష్కర యాత్రికులకు అత్యవసర మందుల పంపిణీ.
- పుష్కర యాత్రికుల షెడ్లకు మరియు పట్టణ సుందరీకరణకు రూ.12.00 లక్షల రూపాయలు కేటాయింపు.

**కౌన్సిలర్స్ మరియు స్టాఫ్**

**మంగళగిరి పురపాలక సంఘము - పాలకమండలి**

1&B

# కృష్ణా పుష్కరాల దృశ్యమాలిక






విజయవాడ





పుష్కరాలను ప్రారంభిస్తున్న ముఖ్యమంత్రి, దేశదాయశాఖ మంత్రి



బాలుని దుర్మణ



షవర్


స్నానఘట్టం


స్నానఘట్టం


బీచ్‌పల్లి-మహబూబ్‌నగర్


పుష్కరాల్లో
ముఖ్యమంత్రి







కృష్ణా పుష్కరాల శుభాకాంక్షలతో...

# కర్నూలు సిటి పొట్టులారీ ఓనర్స్ వెల్ఫేర్ అసోసియేషన్

## సంతోష్‌నగర్- కర్నూలు

| | |
|---|---|
| బి.పెద్దబ్రహ్మారెడ్డి | ఎన్.కాసిరెడ్డి |
| జి.చంద్రశేఖర్ | కె.రామన్న |
| కె.నాగరాజు | బి.బాల్‌రెడ్డి |
| కె.బ్రహ్మారెడ్డి | జి.రామక్రిష్ణ |
| జి.శివయ్య | కె.వెంకటరెడ్డి |
| కె.మహేంద్రరెడ్డి | బి.చిన్న బ్రహ్మారెడ్డి |
| జి.సహాదేవుడు | జి.రమణ |

టి.రఘురాముడు

16E

16F

# శ్రీ నరసింహ స్వామి దేవస్థానము

## ఉరుకుంద (గ్రా), కౌతాళం (మం), కర్నూలు జిల్లా.



### ఆలయ సంగ్రహ చరిత్ర

శ్లో|| ఉగ్రవీరం మహవిష్ణుం । జ్వలంతమ్ సర్వతోముఖం।
శ్రీ నరసింహం భీషణం । భద్రం మృత్యుమృత్యునమామ్యహం||

### ఐతిహ్యాము

కర్నూలు జిల్లా కౌతాళం మండలం, ఉరుకుంద గ్రామములో వెలసిన శ్రీ నరసింహ (ఈరణ్ణ) స్వామిని మహాశక్తిగల దేవుడిగా, మహత్తుగల దేవుడిగా భక్తులు, భక్తి ప్రపత్తులతో కొనియాడుచున్నారు. ఉరుకుంద సిద్ధక్షేత్రం. శివక్షేత్రం ఇక్కడ రెండువేల యేండ్లకు మునుపు ఉన్న మహాతపోధనుడు సిద్ధపురుషుడు శ్రీ ఈర్ణస్వామి తన అంతిమ సమయాన్ని గడిపారు. నిప్పులాంటి దేవుడిగా నీరాజనాలందు కుంటున్నాడు. ముఖ్యముగా అశ్వత్థవృక్ష స్వరూపుడైన శ్రీ నరసింహ ప్రభావము వల్లనే ఉరుకుందక్షేత్రం మహిమాన్వితమైనది. శ్రీ వీరభద్రాంశతో జన్మించిన సిద్ధపురుషుడు, శివయోగి శ్రీ ఉరుకుంద ఈణ్ణస్వామి వీరశివ సంస్కృతి వికాసానికి నిరంతరము ప్రయత్నించిన కార్యశీలి. యోగసాధనలో పురోగమించిన తపోరాశి. తన దివ్యశక్తి ప్రభావము చేత జాతిని ఉత్తేజితం చేసిన అభినవ వీరభద్రమూర్తి. అంతటి మహాయోగి నిలిచిన దివ్యస్థలమే ఉరుకుందస్వామి పాదస్పర్శతో పునీతమైన పవిత్రస్థలమిది. సాక్షాత్తులోకపావన మూర్తియైన శ్రీ వీరభద్రమూర్తి అంశకలిగిన శ్రీ ఈరణ్ణస్వామి సమస్త జనుల కోరికలు తీరుస్తూ కొలిచేవారికి – ఎలుగెత్తి పిలిచేవారికి కొంగు బంగారంగ నిలిచాడు. ఉరుకుంద గ్రామ పొలిమేరలో విస్తారంగ వ్యాపించిన రావిచెట్టు, దాని నీడలో ప్రత్యణువు పవిత్రమైన పరమయోగి నివాసము. ఆయన తపోకాంతులే ఆ వృక్షానంత జ్యోతిర్మయం చేస్తున్నాయి. జ్యోతిర్మయమైన ఆ వృక్ష చాయ శ్రీ స్వామికి మూర్తీభవించిన దివ్యప్రకాశనిలయం. శ్రీ స్వామివారి దివ్యక్షేత్ర సందర్శనము సకల సమృద్ధికరము. సర్వపాపహరము. మోక్షప్రదము.

### శ్రీ స్వామివారి మహాత్యము

శ్రీ స్వామి మహత్యమును గూర్చి తెలుపు కథలు అనేకములు కలవు. సుమారు రెండు వేల సంవత్సరములకు ముందున్న స్వామి మహిమలచే ప్రభావితులై ఇప్పటికీ భక్తాదులు శ్రీ ఉరుకుంద ఈరణ్ణ స్వామి సన్నిధిలో తలలువాల్చి చేతులు జోడించి ప్రార్థిస్తారు. కొందరు నిప్పులాంటి స్వామివారిని కొందరు ఆకాశాన వెలుగుల రూపంలో వుంటాడనీ, విహరిస్తాడనీ, తెల్లని గడ్డంతో వుంటాడనీ అంటారు. మరి కొందరు ఎవరూ లేనపుడు ఒక్కరుగా గర్భాలయములోకి పోలేమంటారు. కొందరు గగుర్పాటు కలుగుతుందంటారు. భూతప్రేత పిశాచములు పట్టినవారు, మానసిక భయాందోళన కలిగినవారు శ్రీ స్వామివారిని దర్శించిన ఆభాధలన్నియు తొలగి పోవునని ప్రతీతి. ముఖ్యముగా శ్రీ స్వామివారిని సోమ, గురవుఆరములయందును, అమావాశ్యయందును విశేషముగా భక్తులు వచ్చి స్వామివారికి నైవేద్యములు (యెడ), టెంకాయ వగైరాలు, ఇచ్చుల ఆచారముగా వచ్చుచున్నది. శ్రీస్వామి వారిని దర్శించి వారి వారి మొక్కుబడులు సమర్పించి శ్రీస్వామి వారి కృపకు పాత్రులగుచున్నారు. భక్తులు ఒక్క ఆంధ్ర దేశము నుండియే గాక కర్నాటక మహారాష్ట్ర ప్రాంతముల నుండి కూడ తండోప తండములుగా విచ్చేయుదురు. ఇక్కడ సంవత్సరములో శ్రావణమాసము ముఖ్య మాసము. ఈ మాసమునందు ముఖ్యముగా వచ్చు సోమ, గురువారాలలో విశేష పూజాదులు నిర్వహించబడును. ఈ 30 రోజులు తిరుణాల వైభవపేతముగా జరుగును. ఇంతటి మహిమాన్వితమైన ఉరుకుంద క్షేత్రమును దర్శించి! తరితురుగాక!!

### శ్రావణమాస ఉత్సవ కార్యక్రమములు

| తేది | వారము |
|---|---|
| తేది: 19-08-2004 | మొదటి గురువారము |
| తేది: 26-08-2004 | రెండవ గురువారము |
| తేది: 02-09-2004 | మూడవ గురువారము |
| తేది: 09-09-2004 | నాల్గవ గురువారము |
| తేది: 23-08-2004 | మొదటి సోమవారము |
| తేది: 30-08-2004 | రెండవ సోమవారము |
| తేది: 06-09-2004 | మూడవ సోమవారము |
| తేది: 13-09-2004 | నాల్గవ సోమవారము |

పైన కనబరిచిన విశేష దినములందు శ్రీస్వామి పూజాదులు, నిర్వహించబడును. మరియు ఆదివారము, బుధవారములలో సమయానుకూలముగా హరికథ కాలక్షేపములు, సాంస్కృతిక కార్యక్రమములు ఏర్పాటు చేయబడును.

### శ్రీవారి పల్లకి ఉత్సవము

తేది : 13-09-2004 చివరి సోమవారము శ్రీవారి పల్లకి ఉత్సవము సాయంత్రం 5.00 గంటల నుండి రాత్రి 9.00 గంటల వరకు దేవస్థానము వారి ఆధ్వర్యమున అతి వైభవోపేతముగా జరుపబడును.

### విశిష్టత

శ్రావణమాసములో నాల్గవ సోమవారానికి ముందు రాత్రి అనగా ఆదివారము స్వామి పల్లకి సేవలో ప్రవేశించెదరు. వివిధ వాయిద్యములతో, భజనలతో ఆ రాత్రి అంతయు స్వామిని ఆరాధిస్తారు. శ్రీ స్వామివారి పల్లకి సోమవారము తెల్లవారుజామున తుంగభద్రానదికి బయలుదేరును. సమస్తమైన మంగళ వాయిద్యములతో, శ్వేత ఛత్రంతో పగటి దివిటీలతో, కరడి వాయిద్యాలతో పల్లకి బయలు దేరుతుంది. ఉరుకుంద నుండి చిరుతాపల్లి, మల్లనహట్టి, తిప్పలదొడ్డి, కందుకూరు గ్రామాలకు శ్రీ స్వామివారి పల్లకి వెళుతుంది. గ్రామ గ్రామాన భక్తులు స్వామిని ఆహ్వానించి పూజలు చేస్తారు. చివరకు కందుకూరు దగ్గరున్న తుంగభద్రకు స్వామి పల్లకి చేరును. అప్పటికే నదికి అవతలి ఒడ్డున ఉన్న కర్ణాటక ప్రాంత భక్తాదులు నది ఇవతలికి వచ్చి స్వామిని దర్శించి ఆరాదిస్తారు. చుట్టు ప్రక్కల గ్రామాల వారు ఆనందోత్సవాలతో పాల్గొనెదరు. తదుపరి పవిత్ర తుంగభద్ర జలాలతో స్వామిని అభిషేకించెదరు. తిరిగి పూజలు నిర్వహించెదరు. దేవస్థానం వారిచే అన్నదాన కార్యక్రమము జరుగును. పల్లకి బయలుదేరి తిరిగి సాయంత్రానికి మంగళవాయిద్యములతో – బాణసంచా వేడుకల తోటి పల్లకి ఉరుకుంద దేవాలయము చేరును. ఈ సందర్భముగా భక్తులు అధిక సంఖ్యలో పాల్గొనెదరు. పల్లకి వచ్చిన వెంటనే స్వామివారి గర్భాలయములో ప్రవేశించేలోపల భక్తాదులు వేలాది టెంకాయలను 'చూరు' కొడతారు. చూరు కొట్టడమంటే వేలాది టెంకాయలు ముక్కలు ముక్కలుగా నేలకు కొడతారు. అదొక దివ్య సన్నివేశము మార్మికమైన విశిష్టసేవ. తదుపరి మహామంగళహారితతో ఆనాటి పల్లకి ఉత్సవము వైభవోపేతముగా ముగుస్తుంది.

### శ్రీవారి ఆలయములో నిర్వహించు పూజలు

శ్రీస్వామి వారికి అర్చన, అభిషేకము, ఆకుపూజ ఇత్యాదులు భక్తుల కోరిక మేరకు నిర్వహించబడుచున్నవి.

### శ్రీవారికి సంవత్సరములో నిర్వహించు ఉత్సవములు

శ్రావణ శుద్ధ పాడ్యమినుండి శ్రావణ బహుళ అమావాస్య వరకు శ్రావణ మాస ఉత్సవములు మరియు కార్తీక శుద్ధ పాడ్యమి నుండి కార్తీక బహుళ అమావాశ్య వరకు కార్తీక మాస ఉత్సవములు. ముఖ్యముగా ప్రతి సంవత్సరము వైశాఖ శుద్ధ చతుర్ధశినాడు 'శ్రీనృసింహజయంతి' మూడు దినములు అతి వైభవముగా నిర్వహించబడును.

### ఈ క్రింది అభివృద్ధి పనులు నిర్మాణం జరుగుచున్నది.

| | | |
|---|---|---|
| 1. | కుప్పగల్ క్రాస్ వద్ద ఆర్చిగేట్ నిర్మాణము | రూ. 4,86,586.00 |
| 2. | ఎరిగేరి క్రాస్ వద్ద ఆర్చిగేట్ నిర్మాణము | రూ. 2,35,000.00 |
| 3. | తుంగభద్ర కెనాల్ వద్ద ఆర్చిగేట్ నిర్మాణము (ఉరుకుంద) | రూ. 3,50,000.00 |
| 4. | షాపింగ్ కాంప్లెక్స్ (హోటల్స్) | రూ. 4,78,000.00 |
| 5. | డ్రైనేజీ & కల్వర్టు నిర్మాణము | రూ. 2,50,000.00 |

### ఈ క్రింది పనులకు టెండర్లు అమోదము నిమిత్తము శ్రీయుత కమీషనరు దేవాదాయ శాఖ, హైదరాబాద్ వారికి పంపడమైనది.

| | | |
|---|---|---|
| 1. | స్వామివారి కట్ట చుట్టూ యిత్తడి కటాంజనము ఏర్పాటుచేయుట | రూ. 10,20,000.00 |
| 2. | షాపింగ్ కాంప్లెక్స్ | రూ. 12,90,000.00 |
| 3. | ఆన్వేటి మంటపము | రూ. 60,00,000.00 |
| 4. | "క్యూ" కాంప్లెక్స్ (వైకుంఠద్వార దర్శనము) | రూ. 20,00,000.00 |
| 5. | ఆర్.సి.సి.క్లోరింగ్ మరియు ఇంటర్నల్ రోడ్లు | రూ. 5,00,000.00 |

### శాశ్వత పూజలు

దేవస్థానమునందు శాశ్వత పూజలు అభిషేకము రూ. 1000/-, ఆకు పూజ రూ. 1000/-, అష్టోత్తర శతనామార్చన రూ. 500/- ప్రకారముగా భక్తాదుల నుండి స్వీకరించి వారు కోరిన తేదిన వారి పేరిట సంవత్సరములో ఒక దినము అందుపై వచ్చు వడ్డీ రాబడితో నిర్వహించుచున్నాము. కావున శ్రీస్వామివారికి శాశ్వత పూజలు చేయించదలచినవారు యం.ఓ. రూపములోగాని, డి.డి. రూపేణ గాని, స్వయముగా గాని దేవస్థాన కార్యలయమునందు చెల్లించి తగు రశీదు పొందవచ్చును.

**పి.సత్యనారాయణ, B.Sc.,**
సహాయ కమీషనరు మరియు కార్యనిర్వహణాధికారి

## కృష్ణా పుష్కర శుభాకాంక్షలతో ....



ఎం.శ్యామప్ప
కాంట్రాక్టర్
గద్వాల్



డి.ప్రతాప్ రెడ్డి
కాంట్రాక్టర్
గద్వాల్





జి.సుబ్రమణ్యం
కాంట్రాక్టర్
గద్వాల్



జె.ప్రభాకర్ రెడ్డి
కాంట్రాక్టర్
గద్వాల్

కృష్ణ పుష్కరాల శుభాకాంక్షలతో ....

# సానుభూతి వద్దు - సహకారం కావాలి

## అభివృద్ధి పథంలో వికలాంగుల సంక్షేమ శాఖ

- 150 మంది అంధులతో ఆశ్రమ పాఠశాల
- 100 మందితో అంగవికలుర వసతి గృహము
- భారత ప్రభుత్వ నిధులతో నడుపబడుతున్న పాఠశాలలు
  1) బ్రహ్మ మానసిక పాఠశాల - మహబూబ్‌నగర్
  2) సర్వోదయ వికలాంగుల వసతి గృహము - నాగర్ కర్నూల్
  3) అందుల ఆశ్రమ పాఠశాల - గద్వాల్
- ఉచితముగా చదువు మరియు భోజన సౌకర్యం కలదు.

**2004 సం॥లో 312 మందికి స్కాలర్ షిప్స్**

- 7300 మందికి పెన్షన్లు
- 1200 మందికి నిరుద్యోగభృతి
- 38 మందికి ఉద్యోగాలు
- 45 మందికి మూడు చక్రాల రిక్షాలు
- 38 మందికి వీల్ చైర్స్
- 100 మందికి చంకకట్టెలు
- 13 మందికి టేపు రికార్డులు
- 60 మందికి చేతి కట్టెలు
- 23 మందికి చెవుడు మిషన్లు ఇవ్వటం జరిగింది.



**డాక్టర్ అశోక్, IAS**
జాయింట్ కలెక్టర్
ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్
వికలాంగుల సహకార సంస్థ





**జగదీశ్, IAS**
జిల్లా కలెక్టర్
మహబూబ్‌నగర్ జిల్లా

**సహాయ సంచాలకులు**
వికలాంగుల సంక్షేమ శాఖ, మహబూబ్‌నగర్ జిల్లా

కృష్ణా పుష్కరాలకు విచ్చేయుచున్న భక్తులకు శుభాకాంక్షలతో....

# పద్మావతి స్టోన్ క్రషర్స్ సేవా సంఘం

**బోయపాలెం**

**గుంటూరు జిల్లా**

---

# చెరుకూరి బ్రదర్స్ స్టోన్ క్రషర్స్

**బోయపాలెం**

**గుంటూరు జిల్లా**

---

# భవాని స్టోన్ క్రషర్స్

**బోయపాలెం**

**గుంటూరు జిల్లా**

కృష్ణ పుష్కరాల శుభాకాంక్షలతో .....

# ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టు, ఆత్మకూరు, కర్నూలు



**వహిదాబేగం,**
C.D.P.O.
ఆత్మకూరు ప్రాజక్టు
కర్నూలు (జిల్లా)

**1994 సం॥ ఐ.సి.డి.ఎస్. ప్రాజక్టు ఆత్మకూరులో ప్రారంభమయినది. 5 మండలాల పరిధిలో 199 అంగన్‌వాడి కేంద్రాలు పనిచేస్తున్నాయి.**

1. 3-6 సం॥ పిల్లలకు పూర్వ ప్రాథమిక విద్య
2. ఇమ్యూనైజేషన్
3. ఆహార, ఆరోగ్య విద్య
4. రెఫరల్ సర్వీసెస్
5. పౌష్టికాహార పంపిణి
6. సలహాలు, సంప్రదింపులు

పై సేవలతో పాటు 1 ఆడపిల్ల లేదా 2 ఆడ పిల్లలకు ఆపరేషన్ చేయించుకున్న మహిళలకు 2 సం॥లోపు ఆడ పిల్ల పేరున "బాలికా సంరక్షణ" పథకము క్రింద 5,000/-రూ. లు బ్యాంకులో డిపాజిట్ చేయుట, 2003-04 గాను 219 పాసుబుక్కులు మంజూరు అయినవి.

కిశోర శక్తి యోజన పథకము క్రింద 11-17 సం॥ పిల్లలకు వారి స్వయం ఉపాధికై 2000/- రూ. ఖర్చు చేసి వారు చీరలపై పెయింటింగ్ ఎంబ్రాయిడరీ, అల్లికలు నేర్పించడమైనది. ఈ పథకము క్రింద 2002-03, 2003-04 సం॥లలో 72 మందికి శిక్షణ ఇవ్వడమైనది. 11-17 సం॥ 10వ తరగతి పాసు మరియు ఫెయిల్ అయిన బాలికలకు తెలుగుబాల మహిళా ప్రగతి ప్రాంగణములో, కంప్యూటర్, లెదర్ వర్క్స్, టైలరింగ్, ఎంబ్రాయిడరీ, శారీ పెయింటింగ్, కుట్లు, అల్లికలు మొ॥ అంశాలలో 50 మంది శిక్షణ పొందినారు. ఇంకా 25 మంది శిక్షణ పొందుచున్నారు.

2004-05 సం॥నకు గాను 2 క్రొత్త అంగన్‌వాడీ కేంద్రాలు ప్రారంభమయినవి. ఇంకా 5 కేంద్రాలకు ప్రపోజల్స్ పంపాము. అత్యాచారానికి గురి అయిన బాలికలకు ఒక విడత 50,000/-రూ. మంజూరు అయినవి. ఇంకా 7 మంది బాలికలకు ప్రపోజల్స్ పంపడమైనది.

ప్రాజెక్టులో 10 సెక్టార్లు వున్నాయి. 7 మంది సూపర్‌వైజర్స్ పనిచేస్తున్నారు.



1. **శ్రీమతి పి. ఆగ్నేష్ ఏంజిల్**
2. **శ్రీమతి బి. ఈస్టర్‌రాణి**
3. **శ్రీమతి కె. కుమారి**
4. **శ్రీమతి కె. పద్మావతి**
5. **శ్రీమతి కె.లక్ష్మిదేవి**
6. **పి.సుగుణమ్మ**
7. **ఎం.వసంతమ్మ**



**మరియు ఆఫీసు సిబ్బంది**

2916K

# శ్రీ భ్రమరాంబ మల్లేశ్వర స్వామివారి దేవస్థానము

## పెదకాకాని, గుంటూరు జిల్లా - 522509. ఫోన్ : 2556184



గుంటూరు జిల్లా, పెద్దకాకాని గ్రామములో వేంచేసియున్న శ్రీ భ్రమరాంబ మల్లేశ్వర స్వామి వారి దేవస్థానము గుంటూరు జోన్‌లోనే అతి పెద్ద ప్రసిద్ధ పుణ్యక్షేత్రముగా విరాజిల్లుచున్నది. ఈ దేవస్థానము నందు శివలింగము శ్రీ శైల లింగాంశము కలిగి యున్నదనుట నిర్వివాదాంశము. ఈ క్షేత్రమును గూర్చి పురాణ ప్రశస్తి గలదు.

పూర్వము భరద్వాజ మహర్షి ఇచ్చట స్వయంభులైయున్న శివునిగాంది నొక యాగము చేయ సంకల్పించి యజ్ఞాల భావి యందు సమస్త నదీ జలములు ప్రోక్షించి యాగము చేయు చుండగా నొక కాకి హవిస్సులను తినుచుండగా భరద్వాజుడాకాకిని శపింపబోయెను. అంత ఆ కాకి తాను కాకాసురుడను రాక్షసుడనని బ్రహ్మవరముచే యాగ హవర్భాగములు తిను వరము పొంది యుంటినని, తనపై అభిషేక జలము ప్రోక్షించిన తన శాపము పోవునని తెల్పెను. భరద్వాజ మహాముని అట్టే చేయగా నా కాకి శాప విమోచనము పొందెను. అందుచేతనే ఈ గ్రామమునకు 'కాకాని' యను పేరు వచ్చినదని, భరద్వాజ మహాముని మల్లియలతో శివుని పనూజించుటచే ఈ స్వామికి మల్లేవ్వరుడని నామము కలిగెనని చెప్పరు.







**సహాయ కమీషనర్ మరియు**

**కార్యనిర్వాహణాధికారి**



# సర్వ శిక్ష అభియాన్

## కర్నూలు జిల్లా




అందరూ చదవాలి - అందరూ ఎదగాలి అనే ఉన్నత ఆశయంతో ప్రభుత్వం ప్రారంభించిన కార్యక్రమము - సర్వశిక్షా అభియాన్, ఉన్నతమైన లక్ష్యాలతో వినూత్నమైన కార్యక్రమాలతో బడిఈడు కలిగిన బాల బాలికలు అందరూ బడిలో ఉండే విధంగా, అంతే కాక బడిలో చేరిన ప్రతి విద్యార్థి బడిలో వుండే విధంగా చర్యలు చేపడుతూ విద్యాభివృద్ధికి కృషి చేస్తున్న మాకు సహకరిస్తున్న అందరికీ కృష్ణ పుష్కరాల శుభాకాంక్షలు.

**సర్వశిక్షా అభియాన్ లక్ష్యాలు :**

☛ సార్వత్రిక ప్రాథమిక విద్యను సాధించడం ☛ గుణాత్మక ప్రాథమిక విద్యను అందించడం ☛ 2007 నాటికి పిల్లలందరూ 5 సంవత్సరాల ప్రాథమిక విద్యను 2010 నాటికి 7 సంవత్సరాల ప్రాథమికోన్నత విద్యను కలిగి ఉండేట్లు చూడడం. ☛ 2010 నాటికి డ్రాప్ అవుట్ లేకుండా చూడడం. ☛ బాలికలందరూ బాలురతో పాటు ప్రాథమిక విద్యను కలిగి ఉండేలా చూడడం.

పై లక్ష్యాల సాధనకై జిల్లా లో సర్వశిక్షా అభియాన్ కార్యక్రమము క్రింద వివిధ అంశాల అమలుకై చర్యలు చేపట్టడం జరుగుతున్నది. అవి

☛ విద్యాబోధనలో నాణ్యత, మెరుగుదల - పాఠశాల బయట ఉన్న విద్యార్థులకు విద్య ☛ పరిశోధన, మూల్యాంకనం, శిక్షణా కార్యక్రమాలు ☛ భవన నిర్మాణం పనులు ☛ ప్రజలలో చైతన్యం, పర్యవేక్షణ, నిధుల విడుదల మరియు సేకరణ

2003 - 04 వరకు డిపిఇపి, సర్వశిక్షా అభియాన్ కార్యక్రమాల వల్ల జిల్లాలో సాధించిన విద్యా ప్రగతి మరియు 2004 -05 సంవత్సరంలో చేపట్టబోయే కార్యక్రమాల వివరాలు.

**నమోదు :**

☛ జిల్లాలో 5-14 సంవత్సరాల బడి ఈడు గల బాల బాలికలు - 7,23,456 ☛ 5-14 సం. బడిలో నమోదు అయిన బాల బాలికలు - 6,89,147 ☛ నమోదు శాతం - 95.25% ☛ బడి బయట ఉన్న 5-14 సం. బాల బాలికలు - 34,309

**భవన నిర్మాణం పనులు (సివిల్ వర్క్స్) :**

☛ సర్వశిక్షా అభియాన్ కార్యక్రమము కొరకు ఆమోదింప బడిన మొత్తం నుండి 33% నిర్మాణం పనుల కొరకు కేటాయించడం జరిగింది. పాఠశాలలకు సదుపాయాలు కలుగజేయడం మరియు మండలాలల్లో శిక్షణా కేంద్రాలు నిర్మించడం నిర్మాణం పనుల యొక్క ముఖ్య ఉద్దేశ్యం. ☛ 2003 -04 వరకు జిల్లాలో 125 నూతన పాఠశాల భవనాలు, 40 పాఠశాలలకు (భవనం లేని) నూతన భవనాలు, 922 అదనపు తరగతి గదులు 54 మండల రిసోర్ సెంటర్లు, 288 పాఠశాలలకు మరుగుదొడ్ల వసతి, 233 పాఠశాలలకు త్రాగునీటి వసతి కల్పించడం జరిగింది.

☛ 2004 - 05 సం.లో 395 అదనపు తరగతి గదుల నిర్మాణం కొరకు చర్యలు చేపట్టబడుచున్నవి.

**గుణాత్మక విద్య (Quality Improvement Programme) :**

☛ విద్యార్థులలో అభ్యసన స్థాయిలను గుర్తించడం. ☛ స్థాయికి తగిన బోధనాభ్యసన క్రియలను కల్పించడం ☛ విద్యార్థుల కనీస అభ్యసన స్థాయిని పెంపొందించడం.

మొదలైన లక్ష్యాలతో 03-04 సం.లో QIP ని 45 రోజులు పాటు నిర్వహించడం జరిగింది. ఈ విద్యాసంవత్సరంలో కూడా 45 రోజులుపాటు నిర్వహించి తదుపరి నిరంతరం గుణాత్మక విద్యను సాధించుటకు సమగ్ర పథకాన్ని రూపొందించుకున్నాం. ఈ కార్యక్రమ పరిపుష్టి కొరకు ఈ విద్యా సంవత్సరంలో

☛ ఉపాధ్యాయ నిధులు (రూ.500/- చొప్పన ) - 5434 (ప్రాథమిక) 5187 (ప్రాథమికోన్నత) ☛ పాఠశాల నిధులు (రూ. 2000 చొప్పన) - 2113 (ప్రాథమిక) 907 (ప్రాథమికోన్నత) విడుదల చేయుటకు చర్యలుచేపట్టబడుచున్నవి. ☛ 2004 - 05 సంవత్సరంలో జిల్లా లోని 299 ప్రాథమిక పాఠశాలలు స్థాయిని ప్రాథమికోన్నత పాఠశాలలుగా పెంచడం జరిగింది.

**ప్రత్యామ్నాయ పాఠశాలలు :**

☛ సమాజ సహకారంతో పాఠశాలలు లేని నివాస ప్రాంతాలు అనగా జనాభా 200 కన్నా తక్కువగా ఉన్న మరియు ఎస్.సి., ఎస్.టి., ప్రాంతాలలో ప్రత్యామ్నాయ పాఠశాలలు ఏర్పాటు చేయబడినవి.

☛ 2003-04 నాటికి జిల్లాలో 178 ప్రత్యామ్నాయ పాఠశాలలు పనిచేస్తున్నాయి. ☛ నూతనంగా 04-05 సంవత్సరంలో 14 ప్రత్యామ్నాయ పాఠశాలలు నెలకొల్పేందుకు చర్యలు తీసుకొనబడుచున్నవి.

**బాల కార్మిక పునరావాసము :**

☛ మన జిల్లాలో 34,309 మంది బాల కార్మికులు, వ్యవసాయ పనులలో గొండ, బీడి పరిశ్రమలలో పత్తి చేలల్లో, చిన్న పిల్లలను ఎత్తు కొనే పని మరియు ఇంటి పని మొదలైన పనులలో నిమగ్నమై పాఠశాలలకు దూరంగా ఉన్నారు. తల్లిదండ్రులకు విద్యపట్ల అవగాహన లేకపోవడం, సమాజం వీరిపట్ల బాధ్యతగా వ్యవహరించకపోవడం వల్ల జిల్లాలో వీరి సంఖ్య అధికంగా ఉంది.

☛ 2003 - 04 వరకు బాలకార్మికుల పునరావాసం కొరకు వివిధ మండలాలో 57 రెసిడెన్షియల్ (బ్రిడ్జికోర్ క్యాంపులను ఏర్పాటు చేసి 4402 మంది బాలకార్మికుల పునరావాసం ఏర్పాటు చేయడం జరిగింది.

**పూర్వ ప్రాథమిక విద్యా కేంద్రాలు (ఇ.సి.ఇ) :**

☛ ఇవి ఆట, పాట, మాట, సృజనాత్మకత ద్వారా 3-5 సం. బాల బాలికలను పాఠశాలకు సన్నద్ధం చేసేందుకు ఏర్పాటు చేయబడిన కేంద్రాలు. ☛ జిల్లాలో ఇంతవరకు 370 పూర్వ ప్రాథమిక విద్యా కేంద్రాలు పని చేస్తున్నాయి. ఇందులో 370 మంది ఇన్‌స్ట్రక్టర్లు మరియు 370 మంది ఆయాలు డిపిఇపి, సర్వశిక్షా అభియాన్ యొక్క గౌరవవేతనంలో పనిచేస్తున్నారు.

**జాతీయ బాలికల ప్రాథమిక విద్యా కార్యక్రమము NPEGEL :**

☛ ప్రాథమిక స్థాయి బాలికల విద్యను మెరుగుపర్చడం కొరకు సర్వశిక్షా అభియాన్ కార్యక్రమాలలో భాగంగా ప్రవేశపెట్టబడిన నూతన విద్యా కార్యక్రమము. ☛ బాలికల నిలువుదల ను మెరుగువర్చడం. ☛ పాఠశాల వసతులు కల్పించడం ☛ విద్యాకార్యక్రమాలలో బాలికలు, స్త్రీలు విరివిగా పాల్గొనేల చేయడం. ☛ బాలికల పరిపుష్టి కొరకు వారి కందించే విద్య ఉపయుక్తంగా గుణాత్మకంగా ఉండేలాచూడడం మొదలైన లక్ష్యాలతో బాలికల విద్యకై కృషి చేసేందుకు జిల్లాలో బాలికల నమోదు మరియు స్త్రీల అక్షరాస్యత తక్కువగా ఉన్న 9 సామూహిక ఆదర్శపాఠశాలలను ఎంపిక చేసుకోవడం జరిగింది. ☛ ఎంపిక చేసుకొన్న 9 సామూహిక ఆదర్శ పాఠశాలల గ్రామాలలో ఉన్న పాఠశాలలకు అనుబంధంగా 18 పూర్వప్రాథమిక విద్యా కేంద్రాలను ఈ విద్యా సంవత్సరంలో ప్రారంభించడం జరిగింది.

**సమగ్ర విద్యా కార్యక్రమము (I.E.D.) :**

☛ 2003-04 వరకు సమగ్ర విద్యా కార్యక్రమము ద్వారా జిల్లాలోని 57 మండలాలలో ఆసరా క్యాంపులను నిర్వహించడం జరిగింది. ఇందులో 14,756 మంది వికలాంగ బాల బాలికలు లబ్ధిపొందడం జరిగింది. ☛ వివిద పరికరాల కొరకు ఎంపిక చేయబడిన వికలాంగ బాల బాలికలకు 303 మూడు చక్రాల సైకిళ్ళు 52 క్రచ్చెస్, 489 వినికిడి యంత్రాలు, 25 వీల్ చైర్, 63 బ్రెయిలీ స్టిక్, 63 బ్రెయిలీ స్లేట్ పంపిణీ చేయడం జరిగింది. ☛ వినికిడి లోపం, మానసిక వైకల్యం, దృష్ట లోపం కలిగిన బాల బాలికల కొరకు జిల్లాలో ప్రత్యేకంగా 15 రెసిడెన్షియల్ బ్రిడ్జి కోర్ క్యాంపులను ఏర్పాటు చేయడం జరిగింది.

బాల బాలికల అభ్యున్నతి కొరకు సర్వశిక్షా అభియాన్ చేస్తున్న ఈ ప్రయత్నాలన్నిటికి మీ అందరి సహకారం, సహాయం ఎంతైనా అవసరం. మాతోపాటు మీరు చేయి చేయి కలిపి తోడ్పాటు అందించిన నాడే అందరూ - చదవాలి - అందరూ ఎదగాలి అనే మన ఉన్నత ఆశయం నెరవేరుతుంది.

**ఎన్. శివరామయ్య**
M.Sc., M.Phil., M.Ed. CIPE (London)
అడిషనల్ ప్రాజెక్టు కో- ఆర్డినేటర్
డిపిఇపి- సర్వశిక్షా అభియాన్,
కర్నూలు

**ఎం.ఎ. మన్నన్**
M.A., M.Ed.,
జిల్లా విద్యాధికారి మరియు
ప్రాజెక్టు కో - ఆర్డినేటర్,
డిపిఇపి, సర్వశిక్షా అభియాన్
కర్నూలు

**ముఖేష్ కుమార్ మీనా I.A.S.**
కలెక్టర్ & ఛైర్మన్ (అ.భా)
డిపిఇపి,
సర్వశిక్షా అభియాన్
కర్నూలు

**"అందరికి విద్య - మనందరి భాధ్యత , బాల బాలికల విద్యాభివృద్ధికి కాంక్షిద్దాం - కలిసి పురోగమిద్దాం"**

2a · 164



యుగయుగాల దేవుడు శ్రీ పానకాలరాయుడు

విజయవాడకు 12 కి.మీ., గుంటూరుకు 20 కి.మీ. దూరంలో

విజయవాడ, గుంటూరు పట్టణముల మధ్య వేంచేసియున్న

# శ్రీ పానకాల లక్ష్మీనరసింహస్వామి వారి దేవస్థానం

మంగళగిరి, గుంటూరుజిల్లా

2004 కృష్ణా పుష్కరముల సందర్భముగా విచ్చేయు భక్తులకు ప్రత్యేక ఆహ్వానము

ది. 28-8-2004 నుండి ది. 8-9-2004 వరకు

మంగళగిరి శ్రీ పానకాల లక్ష్మీనరసింహస్వామి వారిని దర్శించండి, పునీతులై తరించండి.

**ఎగువ సన్నిధి దర్శన వేళలు**

ఉదయం గం.6-00 నుండి

సాయంత్రం గం. 5-00 వరకు

**దిగువ సన్నిధి దర్శన వేళలు :**

ఉదయం గం. 5.00 నుండి

రాత్రి గం. 9.00 వరకు

ఇట్లు

వాసిరెడ్డి సీతారామయ్య
ఫౌండర్ ట్రస్టీ

నూతక్కి కోటయ్య
కార్యనిర్వహణాధికారి

---

గుంటూరు జిల్లా ప్రజలకు కృష్ణ పుష్కరశుభాకాంక్షలు...

# పెద్దవడ్లపూడి గ్రామ పంచాయితీ



మంగళగిరి మండలం, గుంటూరు జిల్లా

1. శ్రీమతి జవ్వాది అన్నపూర్ణ
2. ఇరపని రవి
3. జవ్వాది ఆంజనేయులు
4. షేక్ జాని
5. శ్రీమతి కాపారపు రత్తమ్మ
6. యేళ్ళరామకృష్ణ
7. శ్రీమతి యేళ్ళ రత్నం
8. బండారు రాజారావు
9. శ్రీమతి దగాని షైమావతి
10. మందపాటి ప్రసాద్
11. గద్దల జాన్
12. లింగినేని బాలార్జున
13. శ్రీమతి కంచర్ల రాంబాబు
14. కంపా కోటేశ్వరరావు
15. షేక్ జాన్ బాబు



శ్రీ జిలానీ బాషా
గ్రామ కార్యదర్శి

**ఎం.పి.టి.సి. మెంబర్స్**

భావన శ్రీనివాసరావు, మండల వైస్ ప్రెసిడెంట్
సూదన గుంట కోటేశ్వరరావు
చిటిబొమ్మ రామసుబ్బయ్య

శ్రీ అన్నె చంద్రశేఖర్ గారు
సర్పంచ్

శ్రీ సైకం శివయ్య
ఉపసర్పంచ్

8వేల మంది బహుళార్థక విస్తరణాధికారులుగా (ఎం.పి.ఇ.వో), కాంట్రాక్టు పంచాయితీ కార్యదర్శులుగా 4వేల మంది, మహిళా మరియు శిశు సంక్షేమ శాఖలో 3వేల మంది, సిడిపిఓ, సూపర్‌వైజర్, జూనియర్ అసిస్టెంటు, డేటా ఆపరేటర్లుగా, అనేక ప్రభుత్వ శాఖలో గుమాస్తాలుగా, డిపిఓలుగా, ఆరోగ్యశాఖలో 15 వేల మంది వివిధ కేటగిరీల్లోనూ, వెలుగు ప్రాజెక్టుల్లో 25వేల మంది పని చేస్తున్నారు. రూరల్ వాటర్ సప్లైయి, ఇంకా అనేక కేటగిరీల్లో కాంట్రాక్టు ఉద్యోగులు పని చేస్తున్నారు.

**చెల్లించని వేతనాలు - దారి మళ్లిన నిధులు**

కాంట్రాక్టు ఉద్యోగులకు వేతనాలు నెలకు రు.700 నుండి 5000 మధ్య చెల్లిస్తున్నారు. ఆ వేతనాలు కూడా గత 6 నెలలుగా లేవు. స్పెషల్ విద్యావాలంటీర్లకయితే ఇచ్చే వేతనం వెయ్యి రూపాయలు. అది కూడా సంవత్సర కాలంగా చెల్లించడం లేదు. ఇంతేకాకుండా వారి నుండి ట్రైనింగ్ పేరిట సంవత్సరానికి మూడు వేల రూపాయలు ప్రభుత్వమే కాజేస్తోంది.

వికలాంగులకు విద్య నేర్పే రిసోర్సు టీచర్లకు గత 18 నెలలుగా వేతనాలు లేవు. వీరి వేతనాలకయ్యే ఖర్చంతా కేంద్ర ప్రభుత్వం నెలనెలా చెల్లిస్తున్నా, వీరి వేతనాలను ప్రభుత్వం దారి మళ్ళించి, వీరి జీవితాలను రోడ్లపై పడేసింది. వెలుగు ప్రాజెక్టులో పని చేస్తున్న కాంట్రాక్టు ఉద్యోగులు సంఘాలు పెట్టుకోకూడదంటూ సర్క్యులర్‌ను జారీ చేసి చట్టానికి వ్యతిరేకంగా వ్యవహరించింది యాజమాన్యం. ఓకేషనల్ పార్టుటైమ్ లెక్చరర్లను రు.3600 రూ.ల వేతనంపై నియమించారు. వీరికి గత 36 నెలలుగా వేతనాలులేవు. ఓకేషనల్ లెక్చరర్లకయ్యే వార్షిక జీతం ఖర్చు 9 కోట్ల రూపాయలు. 7సంవత్సరాల పాటు సంవత్సరానికి రు.53 కోట్ల చొప్పున కేంద్రం రాష్ట్రానికి చెల్లించింది. ఆ సొమ్మంతా ఏమైనట్లు?

రాష్ట్రంలోని వివిధ యూనివర్శిటీలు, కార్పొరేషన్లు, పాఠశాలలు, సంక్షేమ హాస్టళ్ళు, ఫారెస్టు తదితర శాఖల్లో దాదాపు లక్ష మంది అనేక సంవత్సరాలుగా ఎన్ఎంఆర్, కంటింజెంట్, డైలీవేజ్ ఉద్యోగులుగా అతి తక్కువ వేతనాలతో పని చేస్తున్నారు.

మున్సిపల్, పంచాయితీ, ఎలక్ట్రిసిటీ తదితర శాఖల్లో దాదాపు 75వేల మంది థర్డ్‌పార్టీ కాంట్రాక్టర్ల ద్వారాపని చేస్తున్నారు. వీరికి కనీస వేతనాలు చెల్లించడం లేదు. ప్రభుత్వం నుండి కనీస వేతనాలు పొందుతున్న కాంట్రాక్టర్లు కార్మికులకు మాత్రం కనీస వేతనాలు చెల్లించడం లేదు. చర్య తీసుకోవల్సిన ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తోంది. థర్డ్ పార్టీ కాంట్రాక్టు విధానాన్ని రద్దు చేసి ప్రభుత్వమే నియామకాలు జరపాలి.

**ఆందోళనలు:–** ఉద్యోగ భద్రత కోసం, సర్వీసుల క్రమబద్ధీకరణ, కొనసాగింపు కోసం, వేతన బకాయిల కోసం కొన్ని కేటగిరీల కాంట్రాక్టు ఉద్యోగులు ఇప్పటికే ఆందోళనలు చేపట్టారు. సమస్యలు పరిష్కరించకపోతే ఈ ఆందోళనలు రాబోయే కాలంలో తీవ్రతరమవుతాయి. మహిళా, శిశు సంక్షేమ శాఖలోని ఉద్యోగులు 55 రోజుల పాటు హైదరాబాదు లో రిలే నిరాహారదీక్షలు, రాస్తారోకోలు జరిపారు. ఎంపిఇఓలు 3వేల మందితో హైదరాబాదులో భారీ ప్రదర్శన చేశారు. వివిధ జిల్లాల్లో కలెక్టరేట్ల ముందు ప్రదర్శనలు జరిపారు. కాంట్రాక్టు లెక్చరర్లు భారీ ప్రదర్శన, వారం పాటు రిలే నిరాహారదీక్షలు నిర్వహించారు. అనేక శాఖల్లోని, కాంట్రాక్టు ఉద్యోగులు ఆందోళనా పథంలోనున్నారు.

**డిమాండ్లు:–** పై కేటగిరీల్లో పని చేస్తున్న కాంట్రాక్టు ఉద్యోగులలో శాశ్వత స్వభావం కలిగిన పనిలో ఉన్న వారందర్ని రెగ్యులరైజ్ చేయాలి. శాశ్వత స్వభావం కాని పనిలోనున్న వారికి వేతనాల పెంపు, లీవు సౌకర్యం, చట్టాల అమలు, మహిళలకు ప్రసూతి సెలవులు అమలు చేయాలి. వేతనాల బకాయిలను వెంటనే చెల్లించాలి. వేతనాలు నెలనెలా రెగ్యులర్‌గా చెల్లించే ఏర్పాట్లు ప్రభుత్వం వెంటనే చేపట్టాలి.

■ ఎ.వి.నాగేశ్వర్రావు

## ప్రభుత్వ విధానాల వల్ల బలవుతున్న వైద్య ఆరోగ్య రంగ కార్మికులు



రాష్ట్ర ప్రభుత్వం వైద్య రంగ కాంట్రాక్టు కార్మికుల సమస్యలు పట్టించుకోవడం లేదు. వీరు ఉద్యోగ భద్రతపై ఆందోళన చెందుతున్నారు. గత తెలుగుదేశం పాలకులు ప్రైవేటీకరణ, కాంట్రాక్టీకరణలను ప్రవేశపెట్టి ఉద్యోగులకు, ప్రజలకు నష్టం కలిగించారు. జి.ఓ.90 ద్వారా పిహెచ్‌సి ల నుండి మెడికల్ కాలేజీలు, ఆసుపత్రుల వరకు డెవలప్‌మెంట్ సొసైటీలకు అప్పగించాలని చూశారు. యూజర్ చార్జీలు ప్రవేశపెట్టి పేదలకు ఉచితంగా వైద్యం అందకుండా చేశారు. ఖాళీ పోస్టులను నింపకుండా కాంట్రాక్టు బేసిస్, థర్డ్‌పార్టీ కాంట్రాక్టు పద్ధతిలో, హెచ్‌డిఎస్ ల ద్వారా కనీస వేతనాలు కూడా అమలు చేయకుండా కార్మికులను, ఉద్యోగులను నింపారు. జనరల్ ఆసుపత్రులన్నింటిలో హాస్పిటల్ డెవలప్‌మెంట్ సొసైటీల ద్వారా రిక్రూట్ చేసి యూజర్‌చార్జీలతో కార్మికులకు రు.1000 నుండి రు.1500 వరకు మాత్రమే చెల్లించారు. కనీసవేతనాలను అమలు చేయలేదు.

కాంట్రాక్టు విధానాన్ని రద్దు చేస్తామని, అందరికి ఉద్యోగభద్రత కల్పిస్తామని, కాంగ్రెసు పార్టీ, ప్రస్తుత ముఖ్యమంత్రి చెప్పారు. యూజర్ చార్జీలు రద్దు చేశారు. కాని, వాటిపై ఆధారపడి పని చేస్తున్న కార్మికులకు ప్రత్యామ్నాయ బడ్జెట్ వెంటనే కేటాయించనందున తీవ్ర సమస్యకు దారితీసింది. కార్మికులను తొలగించినందున ఆందోళన చేపట్టాల్సి వచ్చింది. తూర్పు గోదావరి జిల్లా కాకినాడ జనరల్ ఆసుపత్రిలో మూడు సంవత్సరాలుగా పని చేస్తున్న 106 మంది శానిటేషన్ కార్మికులను, 43 మంది స్టాఫ్ నర్సులను, ఐదుగురు టెక్నీషియన్లను తొలగించి, అందులో 30 మందిని మాత్రమే కొనసాగిస్తామని ఆదేశాలు జారీ చేశారు. ఉద్యోగం పోతుందని ఆందోళన చెంది, కుటుంబాన్ని ఎలా పోషించుకోవాలో తెలియక పోతురాజు అనే శానిటేషన్ కార్మికుడు రైలుపట్టాల కింద పడి ఆత్మహత్య చేసుకున్నాడు. ఆనంద్ అనే కార్మికుడు హాస్పిటల్‌లో ఆత్మహత్యకు ప్రయత్నించాడు. అయినా పాలనా యంత్రాంగం, ప్రభుత్వం కదలనందున తీవ్ర ఆందోళన తర్వాత ప్రభుత్వం దిగివచ్చి శానిటేషన్ కార్మికులందర్ని విధులలోకి తీసుకుంది.

ముఖ్యమంత్రిగారు తన వాగ్దానం మేరకు కాంట్రాక్టు ఉద్యోగులందరికి ఉద్యోగభద్రత కల్పించాలి. అర్హులయిన వారిని రెగ్యులర్ చేయాలి. కాకినాడ కార్మికుడు పోతురాజు కుటుంబానికి ఎక్స్‌గ్రేషియా ఇవ్వాలి.

■ భూపాల్

భీమారంగం జాతీయకరణ దినోత్సవం సందర్భంగా శుభాకాంక్షలతో ......

## "భీమా రంగంలో FDI పెంపు దేశానికి నష్టం సర్వీసు టాక్స్ పాలసీదారులకు భారం"

## త్యాగాలకు సిద్ధపడదాం ......
## పోరాటాలు కొనసాగిద్దాం .......
## LIC, GIC లను కాపాడుకుందాం .........




# Insurance Corporation Employees' Union

## Cuddapah Division

*(Affiliated to All India Insurance Employees' Association Thro South Central Zone Insurance Employees' Federation)*

**Address**

C/o. LIC of India, Divisional Office, College Road,
Cuddapah - 516 004 (A.P.) *Ph : 244077 (R)*




# ఈ దుష్ట విధానం రద్దు కావాలి

**పాకీపని?**
**అవును ఇది నిజం! పచ్చినిజం!!**
**పెంటను ఎత్తి తట్టల్లో మోసుకెళ్ళి...... ఛీ! యాక్!!**
**వినడానికే అసహ్యంగా ఉంది కదూ!**

మన శరీరంలో భాగమైన మన ఎడం చెయ్యి మనకి అంటరానిది. పాకీదొడ్లను శుభ్రంచేసే ఆ జనం కూడా మనకి అంటరానివాళ్ళే!!

ఈ రోజుల్లో కూడా మానవ మలాన్ని తోటి మానవుల చేతనే ఎత్తి శుభ్రం చేయిస్తున్న విధానాన్ని ఏమనాలి? తెల్ల చొక్కాల దాంబికాల మాటున దాగి ఉన్న అమానుషత్వానికి ఇంకా ఏ ఉదాహరణలు కావాలి?

★ ★ ★

ఈ దేశంలో 13 లక్షల మంది ప్రతిరోజు ఉదయం ఈ పనిలో దిగబడుతున్నారు. రాష్ట్రంలో 8 వేలకు పైగా ఉన్నారు. వారిలో నూటికి 90 మంది దళిత మహిళలే. ఈ విధంగా సాటిమనుషులతో మానవ మలాన్ని ఎత్తివేయించడం చట్టరీత్యా నేరం. 1993లోనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, డ్రై లెట్రిన్లు కలిగి ఉండటం, మనుషులతో అశుద్ధాన్ని ఎత్తి వేయించడాన్ని నిషేధించాయి. అందుకు శిక్షగా సంవత్సరం జైలు, వెయ్యి రూపాయల జరిమానా కూడా విధించాయి. ప్రభుత్వమే చట్టాన్ని ధిక్కరిస్తున్నది. రాష్ట్రంలో 109 మున్సిపాలిటీలలో, 2440 మేజర్ పంచాయితీలలో 16,357 సామూహిక డ్రై లెట్రిన్లలో ఇంకా కొనసాగుతున్నాయి. ఒక్కొక్క డ్రై లెట్రిన్‌ను 300-500 మంది వాడుతున్నారు. ఇవి కాక ఇళ్లలో కూడ వ్యక్తిగత డ్రై లెట్రిన్లు లక్షకు పైగా ఉన్నాయి.

ఈ వృత్తిలో ఉన్న మహిళలు తీవ్ర అనారోగ్యానికి గురవుతున్నారు. దుర్వాసన పీల్చిన ఊపిరితిత్తులు తరచూ జబ్బునపడతాయి. అనారోగ్యకరమైన పరిసరాలు, చిన్న గుడిసెలు, కలుషిత నీరు, ఒంటినిండా బట్టలు లేని కారణంగా రోగాలు సహ జీవనం చేస్తాయి. సెప్టిక్ ట్యాంకులు శుభ్ర పరిచే పనిలో ఉన్న వారు మిథైల్ గ్యాస్ వలన చనిపోయిన దుర్ఘటనలు కూడ ఉన్నాయి. చేసే పని అతి నికృష్టమయింది కావడంతో తాగుడుకు బానిసలవుతున్నారు. ఫలితంగా గొడవలు, కొట్లాటలతో, స్త్రీలు, పిల్లల ఏడుపులతో కుటుంబ జీవితం కూడ నాశనమవుతున్నది. పైగా అలగాజనంగా ముద్ర వేయించుకొని, నాగరికుల మనుకునేవారి ఛీదరింపులకు గురవుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2002 డిసెంబర్ కల్లా సఫాయి కర్మాచారులతో మలమూత్రాలను ఎత్తివేసే పద్ధతి లేకుండా చేస్తామని అన్ని రాష్ట్రాల కన్న ముందుగా ప్రకటించినా, ఆచరణలో విఫలమయ్యింది. ఆధునిక లెట్రిన్లను కట్టించడానికి శ్రద్ధచూపలేదు.

సుప్రీం కోర్టు 2003 డిసెంబరు 3న ఈ వృత్తిని అంతం చేయాలని ఆదేశాలిచ్చింది. అవి కూడా అమలుకు నోచుకోలేదు. ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిరసనగా సఫాయి కర్మాచారి ఆందోళన్ దళితుల (కారంచేడు మారణకాండ జరిగిన) జూలై 17 నుండి ఆగస్టు 26 వరకు రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో డ్రై లెట్రిన్లను సర్వేచేసి వాటి కూల్చివేతకు సిద్ధమయ్యింది. ఇది కేవలం దళితుల, సఫాయి కర్మాచారుల ఆత్మగౌరవానికి మాత్రమే సంబంధించింది కాదు. మానవత్వాన్ని కాపాడటానికి జరుగుతున్న పోరాటం. ఈ కార్యక్రమంలో మానవతావాదులంతా భాగస్వాములు కావాలి.

**ఐద్వా కృషి**

**వృత్తిని నిర్మూలించాలని, సఫాయి కర్మచారుల డిమాండ్లను పరిష్కరించాలని కోరుతూ అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) రాష్ట్ర నాయకులు పుణ్యవతి, స్వరూపరాణి, జ్యోతి మున్సిపల్, పంచాయితీరాజ్, సాంఘిక సంక్షేమ శాఖ మంత్రులు, శ్రీయుతులు కోనేరు రంగారావు, జె.సి. దివాకర్‌రెడ్డి, రెడ్యానాయక్‌లకు వినతిపత్రాలు సమర్పించారు. కాకినాడలో జూలై 17వ తేదీన ప్రారంభమయిన డ్రై లెట్రిన్‌లను కూలగొట్టే కార్యక్రమంలో ఐద్వా రాష్ట్ర అధ్యక్షరాలు శ్రీమతి పుణ్యవతి పాల్గొన్నారు.**



ఈమె పేరు నారాయణమ్మ. కోడికూతతో దినచర్య ప్రారంభమతుంది. సూర్యుడు నడినెత్తి కొచ్చేదాక సాగుతుంది. ఆమె వయసు 50 సంవత్సరాలకుపైనే. వందల మంది ఉపయోగించిన సామూహిక మరుగుదొడ్లు శుభ్రం చేస్తుంది. సంవత్సరాల తరబడి ఈ దుర్గంధం పీల్చిడంతో ఊపిరితిత్తులు దెబ్బ తిన్నాయి. అన్నం సయించదు. అనారోగ్యంతో ఒంట్లో నొప్పిలేని చోటంటూ లేదు. తట్టల్ని మోసుకెళ్ళడం వల్ల వర్షా కాలంలో వర్షపు నీరుపడి, ఆ నీరు ఒంటి మీదపడి - ఒళ్ళంతా ఒకటే కంపు. ఎండాకాలం నీరు దొరక్క అదోబాధ. వినడానికీ చదవడానికీ ఇంత అసహ్యంగా ఉంటే? వారి బాధలు ఏ దేవుడాలకించేను? ■

"ఈ వృత్తి హేయమైనది. మనవ సమాజం సిగ్గుతో తలవంచుకొనే పరిస్థితి. ఈ వృత్తిని నిర్మూలించాలి".
- డా॥ బి.ఆర్. అంబేద్కర్



# రాజుగారి పిల్లి



అనగనగా ఒక రాజు గారు... ఆయన గారు ఓ రోజు వేటకు వెళ్లారు. అలా వేట ముగించుకుని విజయోత్స వంతో వస్తుండగా, మహారాజులుం గారికి ఒక బంగారువన్నె పిల్లి దొరికింది.

ఆయన దానిని సంకలో పెట్టుకుని అంతఃపురానికి తెచ్చారు. అల్లారుముద్దుగా పెంచుతున్నారు. మూడు పూటలా పాలు. మధ్య మధ్యలో మాంసం. పిల్లి యమ దర్జాగా బతుకుతోంది.

అయినా ఏం లాభం. రాజుగారి పిల్లి. దానికి ఇంకా పేరు పెట్టలేదు. దానిని ఏ పేరుతో పిలవాలో సిబ్బందికి ఇబ్బందిగా ఉంది. పిల్లిని పిల్లి అంటే అది సాధారణ పిల్లి కాదాయే.. రాజు గారి పిల్లి, మరి రాజు గారు ఏ శిక్ష విధిస్తారోనని మహామంత్రితో సహా రాజస్థానంలోని వారంతా హడలి ఛస్తున్నారు.

ఇక లాభం లేదనుకుని మహామంత్రి గారే రాజుగారితో ఈ ప్రస్తావన తెచ్చారు..

'మహారాజా! మీరు వేటకు వెళ్లి అద్భుతమైన మార్జాలాన్ని తెచ్చారు. అది వచ్చి కూడా చాలా రోజులవుతోంది... కాని దాని నామధేయమేమిటో తెలియక యావత్ సిబ్బంది నానా ఇబ్బంది పడుతున్నారు.. తమరైనా తెలియజేస్తే విని ఆనందిస్తాం...' అని వేడుకున్నాడు.

'అవునవును! మా మార్జాలం వారికి ఇంత వరకు పేరు పెట్టలేదు కదూ! ఆ పనిని వెంటనే ప్రారంభించండి. రాజ్యంలోని ఏడుగురు మేధావులను పిలిపించి ఆ పనిలో ఉండమని చెప్పండి.. వారం రోజుల్లోగా మార్జాలం వారికి సరియగు పేరు సూచించమని మా ఆదేశంగా చెప్పండి.' అంటూ ఆజ్ఞ జారీ చేశారు మహారాజులుంగారు.

వెంటనే మహామంత్రి గారు రాజ్యంలోని ఏడుగురు మేధావులను పిలిపించి, వారికి మంచి వసతి ఏర్పాటు చేసి రాజుగారి ఆజ్ఞను వినిపించారు.

వాళ్లంతా చచ్చాంరా దేవుడా అనుకున్నారు.

తమ పాండిత్యం చివరకు పిల్లికి పేరు పెట్టడానికా అని మదనపడ్డారు.

రాచకార్యం కదా తప్పదు అనుకుని ...: గ్రంథాలు తిరగవేయడం మొదలుపెట్టారు. ఎన్ని ఉద్గ్రంథాలు తిరగవేసినా పిల్లికి ఏ పేరు పెట్టాలో తోచి చావలేదు వారికి.

వారంరోజులు ఇట్టే గడిచి పోయాయి.

ఒక రోజు మహారాజుగారు ఏడుగురు మేధావులను సభకు పిలిపించి, ఉచితాసనాలు వేసి, కుశలు ప్రశ్నలు వేసి, అనంతరం తమ ముద్దుల మార్జాలం వారికి ఏ పేరు పెట్టారో తెలియజేయవలసిందిగా మర్యాద పూర్వకంగా అడిగారు.

మొదటి మేధావి లేచి నిలబడి....

'మహారాజా! మన మార్జాలం వారికి తోడేలు అనే పేరు సరిపోతుంది.' అన్నాడు.

రెండో మేధావి లేచి....

'మహారాజా! మార్జాలం వారికి 'పులి' అని పేరు పెడితే బాగుంటుంద'న్నాడు.

మూడవ మేధావి లేచి 'ప్రపంచంలో సింహం కంటే కంటే భీకరంగా గర్జించే జంతువు మరోటి లేదు కదా... అందుకని సింహం పేరు సరిగ్గా సరిపోతుందని నా అభిప్రాయం... ' అని ముగించాడు.

నాలుగో మేధావి వినయంగా లేచి రాజుగారికి నమస్కరించి...

' మేఘ గర్జన ముందు సింహ గర్జన ఏ పాటిది.. అందువల్ల మన మార్జాల రాజా వారికి 'మేఘం' అనే పేరు కచ్చితంగా సరిపోతుంది.' అన్నాడు.

'మేఘమా గాలి వీస్తే ఉఫ్‌ను ఎగిరి పోతుంది... మేఘం కంటే పవనమే గొప్పది. అందువల్ల మహారాజా మన మార్జాలం వారికి 'పవనం' అని పేరు పెడదాం ...' అన్నాడు ఐదో మేధావి.

ఇలా పిల్లికి పేరు పెట్టే అంశం మీద చర్చ రసోత్తరంగా సాగుతోంది. చివరికి ఏ పేరు ఖాయం చేస్తారోనని సభాసదులు ఎంతో ఉత్సుకతతో ఎదురు చూస్తున్నారు.

ఇంతలోకి ఆరో మేధావి లేచి...

'రాజోత్తమా! గాలి ఎంత బలంగా వీచినను... మన కోటను ఏమీ చేయలేదు. గాలి కంటే మన కోటే గొప్పది... కాబట్టి మార్జాలానికి 'కోట' అనే పేరు బాగా నప్పుతుంది.' అని కూర్చున్నాడు.

'మహారాజా వారు ఏమనుకోకుంటే నాదో చిన్నమనవి' అంటూ లేచి నిల్చున్నాడు ఏడో మేధావి.

'ఏమిటో చెప్పండి...'

'ఏమీ లేదు మహారాజా! మనది ఎంత బలమైన కోటయినా ఎలుకలు మాత్రం దానికి కలుగులు వేస్తూనే ఉన్నాయి. దీనిని బట్టి మన కోట కంటే ఎలుకలే బలమైనవిగా తోస్తున్నాయి. అందువల్ల మన పిల్లికి 'ఎలుక' అనే పేరు బాగుంటుందని....'

ఇంతలో రాజుగారి ఉద్యానవనంలో పని చేసే తోటమాలి ఈ పండిత చర్చను గమనించి గట్టిగా నవ్వాడు.

'ఎందుకు నవ్వుతున్నావ్?' అని రాజుగారు తోటమాలిని ప్రశ్నించాడు.

'మహారాజా! ఎలుకను చంపే పిల్లికి ఎలుక అని పేరు పెట్టడం మహావమానం. అందువల్ల పిల్లికి 'పిల్లి' అనే పేరు సరైంది.' అని తోటమాలి ధైర్యంగా జవాబిచ్చాడు.

పిల్లి పేరు పిల్లిగానే స్థిరపడి పోయింది.

■ వివన

## వెలువడినది




భారత కార్మికోద్యమ నేత, స్ఫూర్తి ప్రదాత కామ్రేడ్ బిటి రణదివె శతజయంతి వార్షికోత్సవం సందర్భంగా ఆయన జీవిత చరిత్ర, బోధనలతో సిఐటియు ఆంధ్ర ప్రదేశ్ కమిటీ 'బిటి రణదివె, జీవితం – బోధనలు' పేరుతో బుక్‌లెట్ ప్రచురించింది.

**వెల: 5 రూపాయలు**

**ప్రతులకు:**

**ప్రజాశక్తి బుక్ హౌస్, చిక్కడపల్లి, హైదరాబాద్.**

## వినిమయ ధరల సూచిక

(బేస్ 1982=100)

| సెంటర్ సీరిస్ | మే 2004 | జూన్ 2004 | లింకింగ్ ఫ్యాక్టర్ (1960=100) |
|---|---|---|---|
| ఆలిండియా | 508 | 512 | 4.93 |
| హైదరాబాద్ | 512 | 511 | 5.23 |
| గుంటూరు | 509 | 513 | 5.60 |
| గూడూరు | 479 | 484 | 4.33 |
| విశాఖపట్నం | 499 | 502 | |
| వరంగల్ | 528 | 539 | |
| కొత్తగూడెం | 501 | 513 | |
| **రాష్ట్ర సీరిస్** | | | |
| విజయనగరం | 437 | 441 | |
| రాజమండ్రి | 489 | 492 | |
| విజయవాడ | 464 | 469 | |
| ఆదోని | 495 | 498 | |
| ఎన్ఎస్‌బి కాంప్లెక్స్ | 489 | 492 | |
| ఎంజిపి కాంప్లెక్స్ | 482 | 486 | |
| ఎ.పి | – | – | |

| లింకింగ్ ఫ్యాక్టరీ | 1971=100 | 1960=100 |
|---|---|---|
| విశాఖపట్నం | 2.48 | 1.87 |
| రాజమండ్రి | 2.55 | 1.81 |
| ఆదోని | 2.33 | 1.88 |
| వరంగల్ | 2.36 | 1.90 |
| ఎన్ఎస్‌బి కాంప్లెక్స్ | 2.52 | 1.89 |
| ఎ.పి | – | – |

సమాచార వనరు : డైరెక్టరు ఆఫ్ ఎకనమిక్స్ & స్టాటిస్టిక్స్ - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము జారీ చేసినది.
ది లేబర్ బ్యూరో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా

# బ్యాంక్ ఉద్యోగుల అఖిల భారత సమ్మె ఆగస్టు 24, 2004

బ్యాంకింగ్ రంగంలో మొత్తం తొమ్మిది యూనియన్ల ఐక్య వేదిక (యునైటెడ్ ఫోరమ్ ఆఫ్ బ్యాంక్ యూనియన్స్) నాయకత్వంలో ఆగస్టు 24న దేశవ్యాపిత సమ్మె విజయవంతమైంది. బ్యాంకింగ్ కార్యకలాపాలు స్థంభించాయి. నవంబరు 2002 నుండి అమలు కావలసిన వేతన ఒప్పందం మీద నిరంతర చర్చలు తప్ప, అంగీకారం కుదరలేదు. యాజమాన్యాలకు ప్రతినిధి అయిన ఐబిఎ మొండి వైఖరికి నిరసగా వెంటనే గౌరవప్రదమైన వేతన ఒప్పందం జరగాలని కోరుతూ ఉద్యోగులు సమ్మె చేశారు.

ఈ సందర్భంగా హైదరాబాద్ బ్యాంక్ స్ట్రీట్‌లో గల ఎస్‌బిఐ ఆవరణలో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది. ఈ ప్రదర్శననుద్దేశించి బ్యాంకు యూనియన్ల నాయకులతో పాటు కా॥ఎం.ఎ.గఫూర్ సిపిఐ(ఎం) ఎంఎల్ఎ, కా॥ఎస్.వీరయ్య, ప్రధాన కార్యదర్శి సిఐటియు, కా॥నారాయణ సిపిఐ, కా॥లక్ష్మినారాయణ ఎఐటియుసి, ఐఎన్‌టియుసి మరియు బిఎంఎస్ నాయకులు ప్రసంగించారు.

నాయకుల ప్రసంగాలలో బ్యాంకు ఉద్యోగులకు న్యాయంగా రావలసిన వేతన ఒప్పందాన్ని సుమారు రెండేళ్ల పాటు తత్సారం చేసిన ఐబిఎ వైఖరిని ఖండించారు. ఉద్యోగుల వేతన ఒప్పందానికి, బదిలీలకు ముడి పెట్టటాన్ని విమర్శించారు. ఇదే జరిగితే వేతన ఒప్పందం జరిగిన మరుసటి రోజు నుండే ఉద్యోగుల మీద దాడి ట్రాన్స్‌ఫర్ల రూపంలో మొదలవుతుందని, ఈ ప్రమాదాన్ని గుర్తించి ఉద్యోగులు అప్రమత్తంగా వుండాలని హితవు పలికారు.

స్టాక్ బ్రోకర్లకు 6000వేల కోట్ల రూపాయలు, బ్యాంకు రుణాలను ఎగవేసే బడాబాబులకు సుమారు 15వేల కోట్ల రాయితీనివ్వగలిగిన ప్రభుత్వం, లక్షలమంది ఉద్యోగులకిచ్చే వేతన పెంపుదలను అంగీకరించక పోవటం, ఈ ప్రభుత్వం ఎవరికోసం పని చేస్తుందో తెలియజేస్తుందని చెప్పారు. బ్యాంకు ఉద్యోగుల డిమాండ్‌ను యధాతథంగా అంగీకరించినా, వేతన పెంపుదల భారం మొత్తం 3వేల కోట్లు మించదు.

ఉద్యోగుల వేతన ఒప్పందాన్ని అంగీకరించాలంటే తన 'అవుట్ సోర్సింగ్' ప్రతిపాదనను యూనియన్లు అంగీకరించాలని ఐబిఎ పట్టుపడుతున్నది. ఇదీ జరిగితే బ్యాంకింగ్ రంగంలో కాంట్రాక్ట్ లేబర్, క్యాజువల్ లేబర్ విచ్చలవిడిగా పెరుగుతారు. ఇది ప్రభుత్వ రంగాన్ని నిర్వీర్యం చేయటానికి, ఉద్యోగభద్రత లేకుండా చేయటానికి దోహదం చేస్తుంది. అందుకే ఉద్యోగ సంఘాలు అవుట్ సోర్సింగ్‌ని గట్టిగా వ్యతిరేకిస్తున్నాయి.

సమ్మె చేస్తున్న బ్యాంకు ఉద్యోగులకు కా॥కె.వేణుగోపాల్, ఎఐఐఇఎ ప్రధాన కార్యదర్శి, కా॥లక్ష్మయ్య ఎపిఎస్‌ఆర్టీసి ఎస్‌డబ్ల్యుఎఫ్ ప్రధాన కార్యదర్శి, కా॥నాగేశ్వరరావు ఎఫ్ఎంఆర్ఐ జాయింట్ సెక్రటరీ తమ సంఘీభావాన్ని తెలిపారు. ■

❑ పరిణామం

# తగు సమయములో జరగని న్యాయం అన్యాయమే

▪ వి.శ్రీహరి

ఈ వ్యాసం కోసం స్టాండర్డ్ వాక్యూం ఆయిల్ కంపెనీ కేసు మరోసారి చదివాను. ఆ కేసు తీర్పు 1960 లో వచ్చింది. అది సుప్రీం కోర్టు తీర్పు. కానీ స్టాండర్డ్ వ్యాక్యూం కేసులో వివాదం తలెత్తింది 1957 ఏప్రిల్‌లో. ట్రిబునల్‌కు నివేదించింది 1958 మే నెలలో. ట్రిబునల్ తీర్పు మరొక సంవత్సరం పట్టింది. కంపెనీ సుప్రీం కోర్టుకు వెళ్లింది 1959లో. 1960 లో అంటే ఒక సంవత్సరంలోనే తీర్పు వచ్చింది. వివాద ప్రారంభకాలం నుండి 4 సంవత్సరాలలో తీర్పు వచ్చింది. అప్పటికి ఏ కార్మికుల కోసం ఈ వివాదం లేవనెత్తారో వారికి ఈ ఫలితం రాలేదు. అలాంటిదే హైదరాబాద్ భారత్ డైనమిక్స్‌లో వుండే కార్మికులు లేవనెత్తిన వివాదం. కేసు, వాద, ప్రతివాదాలు వేరైనా, ఆ వివాదాలలోనూ వుండేదీ స్టాండర్డ్ వ్యాక్యూం కేసులో ఉన్న అంశమే. అయితే భారత్ డైనమిక్స్‌లో కాంట్రాక్ట్ కార్మికులు నేరుగా హైకోర్టుకు వెళ్ళారు. అనుకూలమైన తీర్పు వచ్చింది. యాజమాన్యం సుప్రీం కోర్టుకు వెళ్లింది. వారు హైకోర్టును ఆశ్రయించింది 1992లో. ఇది 2004 సంవత్సరం. 6 సంవత్సరాలు సుదీర్ఘ యాత్ర, అపారమైన వ్యయం తరువాత ఢిల్లీలో గెలిచినా, కంపెనీ మస్టర్‌కు వారింకా ఎక్కలేదు. ఇది ఎన్నిసంవత్సరాల ఎదురుచూపో చూడండి! తగు సమయములో జరగని న్యాయం, అన్యాయమే అవుతుందని శూక్తులు వల్లిస్తుంటారు. ఈ సూక్తి కొందరి విషయంలోనే వర్తిస్తుంది. అమలవుతుంది. కొందరికి వర్తించదు. ఎవరికి వర్తిస్తుంది? ఎవరికి వర్తించదు? ఒక మంత్రికి పదవి పోతోందంటే, రిలయెన్స్ వంటి కంపెనీకి ప్రభుత్వం నుండి ఇబ్బంది ఎదురౌతుంటే ఇప్పుడు పత్రికల పతాక శీర్షిలకు ఎక్కుతున్న వేలకోట్ల బిర్లా ఆస్తుల వివాదం వంటి వాటికి తాత్కాలికమో, తుదితీర్పో కేసువేసిన మరునాడే దొరుకుతుంది. అదే కార్మికుల విషయంలో అలాకాదు. ఎదురు చూడాల్సిందే. ఒక కార్మికుడు వర్క్‌మెన్స్ కంపెన్సేషన్ యాక్టు క్రింద రావలసిన పరిహారం కోసం చేసిన యాత్ర ముప్పై సంవత్సరాలు. వివాదం విన్న రోజున కోర్టులో ఉన్న కార్మికుడు తీర్పు నాటికి చనిపోయాడు. ఆ విషయం విన్న జడ్జిగారు "దైవ లీలలు అని విన్నాం. కోర్టు లీలలు ఈ నాడు కళ్లారా చూశాం" అన్నారు. అదీ ఓదార్పే! పరిష్కారం ఎక్కడ?

కేరళలో ప్రభుత్వ రంగ సంస్థ హిందూస్థాన్ ఇన్‌సెక్టిసైడ్స్ పురుగుల మందును తయారుచేస్తుంది. అది వాతావరణంలో విషం చిమ్ముతున్నది కనుక మూసివేయమని సుప్రీంకోర్టు నియమించిన కమిటీ సిఫార్సు చేసింది. అదే ప్రాంతంలో ఉండే కోకా-కోలా, పెప్సీలు అక్కడేకాదు, రాష్ట్రమంతా ప్రతి సీసాతో విషమమ్ముతున్నారు. భూగర్భ జలాలను పీల్చేస్తున్నాయి. ఈ కంపెనీలు ఆరు నెలల లోగా కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలని సూచించారు.

పబ్లిక్ సెక్టార్, ప్రైవేట్ సెక్టార్లకు దక్కని న్యాయమిది.

ఢిల్లీ నగర జీవితాన్ని కలుషితం చేస్తున్నాయనే వాదనతో ఢిల్లీ శివార్లలో ఉండే వేలాది పరిశ్రమలను తరలించి, వేరేచోట ఏర్పర్చుకోవాలని సుప్రీంకోర్టు ఆదేశించింది. లక్షలాది కార్మికుల నోట మట్టికొట్టింది. "సంపన్న వర్గాల ఆరోగ్యానికి కార్మిక వర్గ ఉపాధి బలి" అంటూ ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్త శ్రీమతి జయతిఘోష్ ఒక విమర్శా వ్యాసంలో విశ్లేసించారు.

పర్యావరణ కాలుష్యాన్ని మనం సమర్థించం. కాని కాలుష్యం - అభివృద్ధి మధ్య ఏర్పడే వైరుధ్యం పెట్టుబడి దారీ వ్యవస్థ అతిలాభ తృష్ణ వల్ల తలెత్తుతుంది. అపారమైన అభివృద్ధిని సాధించిన సోషలిస్టు సోవియట్ రోజుల్లో వాతావరణం కలుషితం కాలేదు. కుంటినడక పెరుగుదల ఉన్న భారత్‌లో అప్పుడే ఆ సమస్య భూతరూపమై వెంటాడుతోంది.

కాలుష్యం పోవాలంటే, కలుషితమైన ఈ వ్యవస్థ పోవాలి.

కార్మికుడికి న్యాయం కార్మిక రాజ్యంలోనే వస్తుంది.

మన స్టాండర్డ్ వ్యాక్యూం కత ప్రక్కదారి పట్టిందేమిటి? అనుకుంటున్నారా? లేదు. ఈ కేసు చదువుతుంటే:

నలభై నాలుగు సంవత్సరాల పోరాటాల చరిత్ర తరువాత కూడా ఆ తీర్పు పరిష్కరించిన విషయాలే, పదే పదే తలెత్తుతున్నాయి. ఆ తీర్పు చెప్పిన అంశాలు ఈ నాటికీ పరిష్కారం కాకుండా, కార్మికులను ఎలా వేధిస్తున్నాయో ననిపిస్తున్నది.

ఆ నాటికి స్టాండర్డ్ వ్యాక్యూం ఆయిల్ కంపెనీ అమెరికా గుత్త సంస్థలో భాగం. చమురు శుద్ధి కార్మాగారమది. అందులో యంత్రాలు, ఫ్యాక్టరీ లోపల పరిశుభ్రం చేసే పనికోసం కాంట్రాక్టు ఇచ్చారు. ఏడాదికి ఒక కాంట్రాక్టర్ వచ్చేవాడు. కాంట్రాక్టు చేసిన రోజుల్లో కార్మికులను నియమించుకొనేవాడు. కాంట్రాక్టు అయిపోగానే ఉద్వాసన చెప్పేవాడు. తిరిగి ఉద్యోగాలలో ఉండడం, ఉండక పోవడం క్రొత్త కాంట్రాక్టర్ దయ. ఆ దయ ఎంతమందికి, ఏ షరతులతో దొరుకుతుందో కాంట్రాక్టరుకే ఎరుక!

1957 అక్టోబరు నుండి 1958 సెప్టెంబర్ వరకూ ఈ పని కాంట్రాక్టు రాంజీ గోర్ హాన్ కంపెనీకి దొరికింది. అంతకు ముందు ఉన్న 67 మంది కార్మికులను తొలగించారు. కొత్త షరతులతో 40 మందికే ఉద్యోగం దొరికింది. అంతకు ముందే అంటే 1957 ఏప్రిల్ లోనే స్టాండర్డ్ వ్యాక్యూం వర్కర్స్ యూనియన్ కాంట్రాక్టు పద్ధతిలో కార్మికులను నియమించే పద్ధతి రద్దు చేయాలని వివాదం లేవనెత్తింది.

యధావిధిగా మేనేజిమెంట్ ఈ వివాదాన్ని తమవైన వాదనలతో ఎదుర్కొన్నారు.

1. అందులో మొదటిది స్టాండర్డ్ వర్కర్స్ యూనియన్‌కు ఈ వివాదంలోని విషయంలో ఎలాంటి ప్రమేయం లేదనేది.

2. ఏ పని ఏవిధంగా చేయించుకోవాలో నిర్ణయించుకునే హక్కు మేనేజిమెంటుది. అందువల్ల యంత్రాలను, ఫ్యాక్టరీని శుభ్రపరిచే పనిలో కాంట్రాక్టు విధానాన్ని ప్రశ్నించే హక్కు కార్మికులకు లేదు.

3. అందువల్ల ప్రభుత్వం ఈ వివాదాన్ని పారిశ్రామిక వివాదంగా చూచి ట్రిబునల్‌కు పంపటం తగిన చర్యకాదు.

ఈ మూడు వాదనలను ట్రిబ్యునల్ కొట్టివేసింది. కాంట్రాక్ట్ పద్ధతిలో నియామకం అక్రమమని తీర్పు చెప్పింది. అయితే ఉద్యోగాల నియామకంలో పాత కాంట్రాక్ట్ కార్మికులనే నియమించవలసిన

అవసరం లేదని, కంపెనీ తన నియామక నిబంధనల మేరకు అర్హత కలవారిని నియమించుకోవచ్చు. కాని అలాంటి నియామకంలో పాత కాంట్రాక్ట్ కార్మికులకు ప్రాధాన్యత చూపడం న్యాయం అంటూ తీర్పు చెప్పింది.

ఈ తీర్పును పైన పేర్కొన్న వాదనలతోనే యాజమాన్యం సుప్రీంకోర్టుకు ఎక్కింది.

వివాదం కాంట్రాక్ట్ పద్ధతిలో నియామకం. వివాదం లేవనెత్తింది స్టాండర్డ్ వాక్యూం కంపెనీ కార్మికులు. వారికీ ఈ వివాదానికి సంబంధం లేదు. కాంట్రాక్ట్ కార్మికులు ఫ్యాక్టరీ కార్మికులు కాదు. వారికి వివాదం వుంటే వారిని నియమించుకున్న కాంట్రాక్టర్‌తో తప్ప ఫ్యాక్టరీ యాజమాన్యంతో కాదు. కాబట్టి వివాదంతో ఫ్యాక్టరీ యాజమాన్యానికి- ఫ్యాక్టరీ కార్మికులకు సంబంధం లేదు. ఇదీ సుప్రీం కోర్టు పరిశీలించిన అంశం.

వివాద అంశం నేరుగా వివాదం లేవనెత్తిన కార్మికులదే అయివుండనక్కర లేదు. యాజమాన్యం నేరుగా కార్మికులను నియమించుకోవాలా, లేక కాంట్రాక్టర్ ద్వారా నియమించుకోవాలా అనేది వివాదం. ఈ విషయంలో యాజమాన్యం నేరుగా నియమించే కార్మికుల జీవితాలకు గూడ ముడిపడి వుంది. అందువల్ల వారికి వివాదంలో ఆసక్తి, దానిని లేవనెత్తే హక్కు వున్నాయి. ఇది సుప్రీంకోర్టు తీర్పు. తమకు ప్రత్యక్ష సంబంధం లేకపోయినా, కార్మికుల ప్రయోజనాలకు పరోక్షంగా ముడిపడి వున్నా కార్మికులు వివాదం లేవనెత్తవచ్చు. (కాంట్రాక్ట్ లేబర్ చట్టం వచ్చిన తరువాత, కాంట్రాక్ట్ కార్మికులు తమంతట తాము వేరే యూనియన్లు ఏర్పచ్చుకోవలసి రావడంతో పరిష్కారమైన ఈ వివాదం తిరిగి వేదిక ఎక్కింది. అదే 44 సం॥ తరువాత అని మేము ఈ వ్యాసం మొదటిలో పేర్కొనేందుకు ఒక కారణం)

ఆ తరువాత సుప్రీంకోర్టు కాంట్రాక్ట్ నియామకం పద్ధతినే పరిశీలించింది.

కాంట్రాక్ట్ పద్ధతిలో కార్మికులను నియమించడం ఆటవిక దశలో మంచిదేమో గాని, ఆధునిక పారిశ్రామిక జీవితంలో అనుమతించ దగిన అంశం కాదు అని ముందుగా సిద్ధాంతీకరించింది. "కాంట్రాక్ట్ పద్ధతిలో నియామకానికి పాతకాలంలో ఎంత అవసరమో, ఎంత మంచిదో తెలియదు. కాని చట్టము, న్యాయము, సమానతా భావాలతో తలెత్తే అన్ని సంక్లిష్టమైన బాధ్యతలకు మేనేజిమెంటు ప్రత్యక్ష బాధ్యత వహించడం ఆశించదగిన అంశం" అంటూ రాయల్ కమిషన్ చేసిన సిఫార్సును పేర్కొన్నది. అదే సమయంలో కాంట్రాక్ట్ లేబర్ నియామకం అనేది సిద్ధాంతపరం గానో, పాండిత్య సమస్య గానో గాక నిత్య జీవిత సమస్యగా పరిశీలించి తీర్పు చెప్పాలని చెప్పింది. (ఈ మాటలు ఆ తరువాత కాలంలో ఈ విషయంలో రకరకాల తీర్పులకు ఎలా దారితీసిందో మరొక వ్యాసంలో చర్చించుకుదాం) స్టాండర్డ్ వాక్యూం కేసులో కాంట్రాక్ట్ పద్ధతిలో నియమించిన కార్మికుల స్థితిని పరిశీలించింది.

వారికి పి.ఎఫ్. లేదు. గ్రాట్యుటీలేదు. బోనస్ హక్కులేదు. సెలవులు లేవు. వైద్య సదుపాయాలు లేవు. క్యాంటీన్‌లో చౌక ఆహారం లేదు. గృహవసతి లేదు. ఇవన్నీ యాజమాన్యం నియమించే కార్మికులకు వున్నాయి. దీనినే కోర్టు పేర్కొంది.

ఈ పరిస్థితులను గురించి కార్మికులు వివాదం లేవనెత్తినప్పుడు, ట్రిబ్యునల్‌కు వాటిని విచారించి తీర్పు చెప్పే అధికారం సుప్రీం కోర్టు చెప్పింది. ఇక్కడా కోర్టు తీర్పు ఒక హంసపాది పెట్టింది. తన పరిశ్రమను ఎలా నిర్వహించుకోవాలో నిర్ణయించుకోడం మేనేజిమెంట్ హక్కు అనే వాదనను సూత్రాప్రాయంగా ఈ తీర్పు ఆమోదించింది. ఈ హక్కును ట్రిబ్యునల్ తీర్పు నిరాకరించలేదని అభిప్రాయపడింది. కాంట్రాక్ట్ కార్మికులుగా పనిచేసే వారందరినీ పర్మనెంట్ కార్మికులుగా తీసుకోవాలని ట్రిబ్యునల్ చెప్పలేదు. అదే మేనేజిమెంట్ హక్కులలో ట్రిబ్యునల్ జోక్యం కలిగించుకోలేదు అనేందుకు గుర్తు అన్నది. (ఇదీ విరుద్ధ తీర్పులకు దారి తీసింది)

అయితే ఈ తీర్పు ప్రాముఖ్యత కాంట్రాక్ట్ పద్ధతిలో నియామకం అవాంఛనీయమని చెప్పింది. అలా అవాంఛనీయంగా పరిగణించవలసిన పరిస్థితులను క్రోడీకరించింది.

కార్మికవర్గానికి రావలసిన ప్రయోజనాలను నిరాకరించేందుకు "ముసుగు"గా కాంట్రాక్ట్ విధానాన్ని మేనేజిమెంట్ ఆశ్రయిస్తే, అలాంటి సందర్భాలలో కాంట్రాక్ట్ కార్మికులను మేనేజిమెంట్ కార్మికులుగానే గుర్తించాలనే తీర్పులను యజమాని- కార్మిక సంబంధాల పునాదిగా ఎలా నిర్ణయించాలనేది వివిధ తీర్పులలో చెప్పిన విషయాలు గత వ్యాసంలో పేర్కొన్నాం.

కాంట్రాక్ట్ విధానం అలాంటి "ముసుగు" గాకున్నా, ఆ విధానాన్ని కోర్టులు పరిశీలించవచ్చనే కొత్త మలుపును ఈ తీర్పు ఏర్పర్చింది.

కాంట్రాక్టర్ నిజం. కాంట్రాక్ట్ కార్మికులు నిజం. ఆ కార్మికుల నియామకం కాంట్రాక్టర్ చేస్తున్నాడనేది నిజం. అలాంటి సందర్భంలో ఆ విధానాన్ని రద్దు చేయాలని కార్మికులు కోరే హక్కును ఈ తీర్పు ఇచ్చింది. అలా కోరే సమయంలో కార్మికవర్గం చూపవలసిన అంశాలను పేర్కొన్నది.

కాంట్రాక్ట్ విధానంలో నియామకాన్ని నిషేధించే విషయంలో పరిశీలించవలసిన అంశం :

(I) కాంట్రాక్ట్ కార్మికులు చేసే పని నిత్యం కొనసాగే, నిరంతరం వుండే పనేనా? ("నిరంతరం" అంటే నిర్వచనం కోసం కార్మికులు కోర్టులకు ఎక్కాల్సి వచ్చింది)

(II) ఆ పని ఫ్యాక్టరీలో జరిగే పనిలో భాగంగా సాగుతోందా లేదా దానికి సంబంధించి, అవసరమైన పనేనా?

ఉదాహరణ : ఎఫ్.సి.ఐ. ధాన్యం ప్రొక్యూర్‌మెంట్, అమ్మకాలకోసం ఏర్పడిన సంస్థ. కొన్న ధాన్యం గోడౌన్‌లకు చేర్చి నట్టుకట్టడం, అమ్మే సమయంలో లారీలకు, వ్యాగన్‌లకు ఎక్కించడం అసలు కార్యక్రమంతో సంబంధం వున్నపని.

రైల్వేలు రవాణా వ్యవస్థ. కాని ప్రయాణీకులకు సౌకర్యం కలిగించేందుకు, క్యాటిరింగ్ సర్వీసులు, పోర్టర్ సర్వీసులు అంతర్భాగమని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది.

(III) తగినంత మందిని శాశ్వతంగా నియమించుకోదగినంత పని పరిణామం నిరంతరం వుంటుందా?

(IV) అలాంటి పనిని ఇతర సంస్థలలో రెగ్యులర్ వర్కర్లతో చేయిస్తున్నారా?

అనేవి గీటు రాయిగా వుండాలని సుప్రీంకోర్టు చెప్పింది.

1970లో వచ్చిన కాంట్రాక్ట్ లేబర్ చట్టంలో ఈ అంశాలనే పొందుపరచారు.

ఆ చట్టం వివరాలు, దాని నుండి తెలత్తిన వివాదాలు తరువాత వ్యాసాల్లో చూద్దాం. ■

# దోమకాటు ద్వారా వ్యాపించు వ్యాధులు - నివారణ చర్యలు

## 1. మలేరియా :



**వ్యాధి లక్షణాలు** : చలి, వణుకుతో కూడిన జ్వరం వస్తుంది. జ్వరం ఏదైనా సరే ముందుగా రక్త పరీక్ష చేయించుకుని మలేరియాగా నిర్ధారించుకోవాలి.

**చికిత్స** : ఏ జ్వరానికైనా మలేరియా మాత్రలు పనిచేస్తాయి. మలేరియా వ్యాధిగ్రస్థులకు మాత్రం 3 రోజులు లేదా 5 రోజులు పూర్తి మోతాదు తీసుకోవాలి. అశ్రద్ధ చేస్తే వ్యాధి తిరగబడుతుంది.

**వ్యాప్తి** : 'అనాఫిలస్' రకం దోమ ద్వారా ఒకరి నుంచి ఒకరికి ఈ వ్యాధి కారక క్రిమి 'ప్లాస్మోడియా' వ్యాప్తి చెందుతుంది. దోమకాటు నుంచి రక్షణ, వ్యాధి నివారణలో ముఖ్యం, దోమ కుట్టిన 8 నుంచి 12 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి. చిన్న పిల్లలకు, గర్భిణీ స్త్రీలకు ఈ వ్యాధి ప్రమాదకరం.

## 2. ఫైలేరియా :



**వ్యాధి లక్షణాలు** : తరచు వచ్చే తక్కువపాటి జ్వరం, గజ్జల్లో, చంకలో బిళ్ళలు కట్టడం, కాళ్ళు, చేతులు, వృషణాలు, వాపు, ఆయాసం, నీరసించడం.

**చికిత్స** : రక్త పరీక్ష చేయించుకుని ఫైలేరియా క్రిములున్నదీ లేనిదీ తెలుసుకోవాలి. క్రమం తప్పకుండా డి.ఇ.సి. మాత్రలు వేసుకోవాలి. వాచిన అవయవాలను శుభ్రంగా వుంచి పుండ్లు, గాయాలు అవ్వకుండా జాగ్రత్త వహించాలి.

**వ్యాప్తి** : 'కూలెక్స్' రకానికి చెందిన దోమ ద్వారా 'ఉచిరేయా' అను పరాన్న జీవి వలన ఈ వ్యాధి వస్తుంది. దోమకుట్టిన సంవత్సరం తర్వాత కాని లక్షణాలు కనిపించవు. ఎక్కువసార్లు దోమకాటుకు గురైతేనే ఈ వ్యాధి వస్తుంది. చిన్నతనంలో సోకిన ఈ వ్యాధి పెద్దయ్యాక కాని బయటపడదు.

## 3. మెదడువాపు :



**వ్యాధి లక్షణాలు** : ఆకస్మికంగా వచ్చు తీవ్రమైన జ్వరం, శరీరం బిగుసుకుపోవడం, కాళ్ళూ చేతులు కొట్టుకోవడం, అసాధారణ కండ్ల కదలిక మెడ కండరాలు బిగుసుకుపోవటం, పాక్షికంగా కాని, పూర్తిగా కాని అపస్మారకస్థితి. శరీరం ఏదో ఒకవైపు పక్షవాతానికి గురికావడం.

**చికిత్స** : ఈ వ్యాధికి పూర్తి చికిత్స లేదు. లక్షణాలు బట్టి ఉపశమన చర్యలు చేపట్టాలి. ఎంత త్వరగా వైద్యుని దగ్గరకు వెడితే అంత ఎక్కువ ఉపశమనం కలుగుతుంది. వ్యాధి ముదరటం వలన కలిగే దుష్ఫలితాలు జీవితాంతం ఉండిపోతాయి.

**వ్యాప్తి** : 'వైరస్' వలన కలిగే ఈ వ్యాధి 'క్యూలెక్స్' దోమ ద్వారా వ్యాపిస్తుంది. 2 నుండి 14 సం॥రాల లోపు పిల్లలు ఈ వ్యాధి బారినపడే అవకాశాలు ఎక్కువ. దోమకాటుకు గురైన 4-6 రోజులకు వ్యాధి లక్షణాలు కనిస్తాయి.

## 4. డెంగూ జ్వరం :



**వ్యాధి లక్షణాలు** : డెంగూ జ్వరం, డెంగూ హెమరేజ్ లక్షణాలు కల్గించే ఈ వ్యాధి హఠాత్తుగా వచ్చు తీవ్రమైన జ్వరంతో మొదలవుతుంది. కండ్లు కదిలించలేని పరిస్థితి. ఎముకల్లోనూ కండరాలలో భరంఇంచలేని నొప్పి, శరీరంపై పొక్కులు (రాష్) వస్తుంది. వాంతులు, వికారం రక్తంతో కూడిన మలవిసర్జన, ఒకసారి వచ్చిన జ్వరం 7 నుండి 10 రోజులకు మళ్ళీ తిరగబెడుతుంది.

**చికిత్స** : 'వైరస్' వలన కలిగే ఈ వ్యాధికి పూర్తి చికిత్స లేదు. లక్షణాలు బట్టి వైద్యునిచే ఉపశమన చర్యలు చేపట్టాలి. శరీరంలోనికి ద్రవాలను ఎక్కించటం ద్వారా సత్వర నివారణ పొందవచ్చును. పూర్తిగా కోలుకునే వరకు వైద్యుని పర్యవేక్షణలో ఉండాలి.

**వ్యాప్తి** : 'వైరస్' వలన కలిగే ఈ వ్యాధి 'ఏడిస్' రకం దోమకాటు ద్వారా వ్యాప్తి చెందుతుంది. ఈ దోమలు ఇండ్లలోని నీటి నిల్వల్లో పెరుగుతాయి. కాబట్టి ఇండ్లలోనూ, పరిసరాల్లోనూ నీరు నిలవకుండా చూసుకోవటం ఈ వ్యాధి నివారణలో ముఖ్యాంశం. ఈ దోమలు పగలు రాత్రి కూడా కరుస్తాయి / కుట్టును.

## 5. దోమలు - రకాలు :

1. **అనాఫిలస్** : ఇవి మలేరియా వ్యాధిని వ్యాప్తి చేస్తాయి. మంచినీటి నిల్వల్లో పెరుగుతాయి. రాత్రిపూట ఇండ్లలోనికి ప్రవేశించి రక్తం పీలుస్తాయి.
2. **కూలెక్స్** : వీటి ద్వారా బోధవ్యాధి (ఫైలేరియాసిస్), మెదడువాపు వ్యాధులు వ్యాప్తి చెందుతాయి. ఈ దోమలు మురికినీటిలో, పంట పొలాల్లో, కాలువల్లో పెరుగుతాయి. ఇవి మానవుల రక్తంతోపాటు జంతువుల రక్తాన్ని కూడా తీసుకుంటాయి.
3. **ఏడిస్** : ఇవి డెంగూ వ్యాధిని వ్యాప్తి చేస్తాయి. ఇండ్ల పరిసరాల్లోని నీటి నిల్వల్లో పెరిగి పగలూ, రాత్రి కూడా కుడతాయి.
4. **మాన్సోనియా** : వీటి ద్వారా ఒక రకమైన బోధవ్యాధి (ఫైలేరియాసిస్) వ్యాపిస్తుంది. ఇవి నీటి మొక్కలు ఉన్న నీటిలో పెరుగుతాయి.
5. **అర్మిజరిస్** : వీటి వలన ఎలాంటి వ్యాధులు వ్యాప్తి చెందనప్పటికీ ప్రజలకు తీవ్రమైన అసౌకర్యాన్ని కలిగిస్తాయి. ఇవి మరుగుదొడ్లు, పరిశ్రమల నుంచి వెలువడే మురుగునీటిలో పెరుగుతాయి.

**దోమకాటు నివారణకు మార్గాలు** : దోమలు నీటిలో పెరిగి పెద్దయ్యాక గాలిలో ఎగురుతాయి. కాబట్టి నీరు నిల్వకాకుండా చూసుకోవటం ముఖ్యాంశం. నీటిలో పెరుగు దోమ పిల్లలను నియంత్రించుటకు రసాయనాలు నీళ్ళపై చల్లడం, నీటి నిల్వల్లో చేపలను పెంచటం లాంటివి కూడా దోమల సాంద్రతను తగ్గిస్తాయి. పొగ యంత్రాల ద్వారా పొగబెట్టడం, గాలిలో కలిసిపోయే మందులు చల్లటం వలన దోమల నశిస్తాయి. ఇండ్లలో గోడలపై మందులు చల్లటం వలన దోమల నివారణ తద్వారా వ్యాధుల నియంత్రణ సాధించవచ్చు. దోమ తెరలు వాడుట.

**దోమలు ప్రజారోగ్యానికి ప్రధాన శత్రువులు**


**శ్రీ పి. అనిల్ కుమార్**
జిల్లా మలేరియా అధికారి, గుంటూరు

**డా॥ ఎమ్.సోనార్‌బాబు, M.B.B.S.**
జిల్లా వైద్య, ఆరోగ్య శాఖాధికారి, గుంటూరు

**శ్రీ కె.రామకృష్ణారావు, I.A.S.,**
కలెక్టర్ & జిల్లామెజిస్ట్రేట్, గుంటూరు.

❑ లీగల్‌నోట్స్

# దగాకోరు కాంట్రాక్ట్

**గుజరాత్ హైకోర్టు ఇటీవల కాంట్రాక్టు లేబర్ పై ఇచ్చిన తీర్పు పరిశీలించదగింది. నేడు ప్రభుత్వరంగ సంస్థలైనా, లేదా ప్రైవేటు రంగ సంస్థలైనా కాంట్రాక్టు లేబర్ యెడల అనుసరించే విధానాలను ఈ తీర్పులో స్పష్టంగా గమనించవచ్చు.**

ఈ వివాదం స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారికి, గుజరాత్ మజ్దూర్ పంచాయత్, ఇతరుల మధ్య జరిగింది.

స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా ఒక గవర్నమెంట్ రిజిష్టర్డ్ కంపెనీ. ఇది ఇనుము, స్టీల్‌ను యాంగిల్స్, బార్స్, క్వాయిల్స్, గడ్డర్స్, వైర్స్, రాడ్స్, లూమ్స్, బిల్లెట్స్, ఐరన్ గడ్డర్స్, వగైరా రూపాలలో ఉత్పత్తి చేసి మార్కెట్ చేస్తుంది. ఈ కంపెనీ ఉత్పత్తి కేంద్రాలు బొకారో, రూర్కెలా, భిలాయ్, అలాయ్ స్టీల్ ప్లాంట్ దుర్గాపూర్, స్టెయిన్‌లెస్ స్టీల్ ప్లాంట్ సేలం, బర్నపూర్, భద్రావతి, చంద్రపూర్ లలో ఉన్నాయి. దీని మార్కెటింగ్ కేంద్రాల్లోని స్టాక్‌యార్డ్ ఒకటి గుజరాత్‌లోని కాలిగాం, సబర్మతీ అహ్మదాబాద్‌లో ఉంది.

రైలు ద్వారా, రోడ్డు మార్గాన స్టాక్‌యార్డ్‌కు వచ్చే మెటీరియల్‌ను, వెళ్ళే వాటిని లోడింగ్ అన్‌లోడింగ్ చేయటం, స్టాక్‌యార్డ్‌లో వాటిని క్రమపద్ధతిలో ఉంచటం 160 మంది కార్మికులు చేస్తూ ఉంటారు. వీరు "సెయిల్" ఆజమాయిషీలో పని చేస్తారు. వీరు 3 షిఫ్టులలో పని చేస్తారు. ప్రతి షిఫ్టు 8 గంటల కాలం ఉంటుంది. కంపెనీ వారి క్రేన్‌లు, పరికరాలు, ఇతరత్రా అవసరమైన వాటిని నిపుణతతో వినియోగిస్తూ పని చేస్తూ ఉంటారు.

స్వభావ రీత్యా వీరిది నిత్యం ఉండే శాశ్వతమైన పని. క్రమబద్ధంగా చేయవలసిన పని. వీరిలో అనేక మంది 25 సంవత్సరాలుగా పని చేస్తున్నారు. వీరు లేకుండా ఇక్కడ ఏ పని జరగదు.

స్టాక్‌యార్డ్‌లో పనిచేసే 160 మంది కార్మికుల్ని "సెయిల్" ఉద్యోగులుగా గుర్తించి, వేతనాలు వగైరా సదుపాయాలను వర్తింప చేయాలని వారి యూనియన్ గుజరాత్ మజ్దూర్ పంచాయత్ 21 మార్చి, 1992న కంపెనీకి డిమాండ్ నోటీసు అందజేసింది. ఈ వివాదంపై లేబర్ డిపార్ట్‌మెంటు ముందు కన్సిలియేషన్ జరుగుతుండగా 20 జులై, 1993న "సెయిల్" యాజమాన్యం హాండ్లింగ్ కాంట్రాక్టు నియామకం కోసం టెండర్ నోటీసులు జారీ చేసింది. ఈ తతంగాన్ని పూర్తి చేసి బర్ధన్ & కంపెనీ వారికి అక్టోబర్ 23న కాంట్రాక్టును నాలుగున్నర సంవత్సరాలకు అప్పగించారు. 1993 డిసెంబర్ 17న ఈ కంపెనీ చట్టపరిధిలో వర్తించే లైసెన్సులను ఒక సంవత్సర కాలానికి పొందింది. కాంట్రాక్టు ఇచ్చే నాటికి కాంట్రాక్టర్‌కు లైసెన్సు లేదు. ఆ తరువాత పొందిన లైసెన్సు కూడా ఒక సంవత్సరానికి మాత్రమే. కాని విచిత్ర కరమైన విషయం ఏమిటంటే కాంట్రాక్టర్ ఉపయోగించిన స్టాంప్ పేపర్లు 1994 జనవరి 3న కొన్నవి. దీనిని బట్టి ఈ కాంట్రాక్టు తతంగం మొత్తం మోసంగా అర్థమవుతుంది.

కన్సిలియేషన్ విఫలమవడంతో కథ ట్రిబ్యునల్‌కు చేరింది. 8 నవంబర్, 1996న ట్రిబ్యునల్ సాక్ష్యాలను నిశితంగా పరిశీలించి ఈ క్రింది నిర్ధారణలు చేసింది.

1. కాలిగాం. సబర్మతీ, అహ్మదాబాద్ యార్డ్ "సెయిల్" యాజమాన్యందే.

2. 1973 మే 19 నుండి 1975 మే 18 వరకు రతన్‌సింగ్, మదన్‌లాల్ శర్మ లకు యార్డ్ పనులను కాంట్రాక్టు ఇచ్చామని కంపెనీ చెబుతున్నా, వారు ఎటువంటి పనులు చేసేవారో, ఎలా చేసేవారో మాత్రం కంపెనీ వివరాలు చూపలేకపోయింది.

3. ఈ 160 మంది కార్మికులు బర్ధన్ & కంపెనీచే నియమించబడిన వారు కాదు. ఈ కార్మికులు 'సెయిల్' అధికారుల పర్యవేక్షణలో వారి ఆజమాయిషీ కింద దశాబ్దాల తరబడి పని చేస్తూనే ఉన్నారు.

4. ఈ వివాదం ట్రిబ్యునల్‌కు నివేదించబడిన తరువాత (31 జులై, 1993) యార్డ్ నిర్వహణ కాంట్రాక్టు బర్ధన్ & కంపెనీకి 'సెయిల్' 1993 అక్టోబర్ 23న అప్పగించింది. దీనికోసం 1994 జనవరి 3 నాటి స్టాంప్ పేపర్లు వాడింది. ఆ పత్రాలపై ఏ 'సెయిల్' అధికారి యొక్క ఆఫీసు ముద్రలు కాని, సంతకాలు కాని లేవు. ఈ కారణం చేత ఈ కాంట్రాక్టు ఒప్పందం ఒక తప్పుల కుప్ప. ఇది కార్మికుల హక్కులను హరించేందుకు జరిపిన ఒక మోసపూరితపు చర్య.

5. 1975 తరువాత ఏ కాంట్రాక్టరు ఈ కంపెనీ యార్డ్‌లో పనిని ఆజమాయిషీ చేయనందున, కంపెనీ స్వయంగా తనే కార్మికులపై ఆజమాయిషీ చేస్తూ, పని అప్ప గించి చేయించిందని నిర్ధారణ అవుతున్నది.

**ట్రిబ్యునల్ అవార్డు**

ఈ క్రింది అవార్డును ట్రిబ్యునల్ ఇచ్చింది.

**ఈ కార్మికులు 'సెయిల్' కంపెనీ పర్మినెంట్ కార్మికులుగా పరిగణించి కంపెనీకి వర్తించే జీతభత్యాలను, సౌకర్యాలను వీరికి ఇవ్వాలి. 1993 జులై 31 నుంచి వీరి సర్వీసులను రెగ్యులరైజ్ చేయాలి.**

తిరిగి ఈ కేసు "స్పెషల్ సివిల్ అప్లికేషన్ నెం.10225/1996, స్పెషల్ సివిల్ అప్లికేషన్ నెం.2643/1997, తేది:18 సెప్టెంబర్, 2003 ద్వారా గుజరాత్ హైకోర్టు కు చేరింది. గుజరాత్ హైకోర్టు కేసును పూర్తిగా పరిశీలించి ట్రిబ్యునల్ సక్రమంగా అవార్డు నిచ్చిందని, దానిలో జోక్యం చేసుకోవల్సిన అవసరం లేదని, యాజమాన్యం వాదనలో పస లేదని కొట్టివేసింది.

'సెయిల్' కంపెనీ 12 మంది సూపర్‌వైజర్ల ప్రత్యక్ష పర్యవేక్షణలో కంపెనీ సర్వీసులను ఈ కార్మికులు నిర్వహిస్తున్నారు. వీరి సర్వీసుల్ని ఆజమాయిషీ చేసే కాంట్రాక్ట్ అధికారులెవరు లేరు. మంగత్రామ్, నెబ్రూన్, ఇంటర్‌సిటి, నైటెక్స్, వెస్టర్న్ రిటెయినర్స్, దుర్గా క్రేన్ కంపెనీ, శ్రీచాంద్ రోలింగ్ మిల్స్, భాటీయా కంపెనీ, ఆర్.సి.గుప్త కంపెనీ, బర్ధన్ & కంపెనీ వంటి కాంట్రాక్టర్ల పేర్లు ప్రస్తావిస్తున్నప్పటికీ వీరెవరు ఈ కార్మికులను నియమించలేదు. పాతిక సంవత్సరాలకు పైగా వీరే పని చేస్తూ ఉన్నారు. ఈ పనిలో కేవలం ఒక కాంట్రాక్ట్ పత్రం సమర్పించటం తప్ప కాంట్రాక్టర్ కు పనిలేదు. కార్మికులకు కంపెనీ జీతభత్యాలు ముట్టకుండా చేయడం కోసం ఏర్పాటు మాత్రమే ఈ కాంట్రాక్టు అని గుజరాత్ హైకోర్టు చెప్పింది.

(ఆధారం LLJ 2004 August 970 to 994) ■

❑ ప్రొఫైల్

# మహాకవి నెరూడా శత జయంతి



ఈ సంవత్సరం 20వ శతాబ్దపు మహాకవి నెరూడా శత జయంతి. నెరుడాకు 1971లో సాహిత్యానికి నోబుల్ ప్రైజ్ లభించింది. 20వ శతాబ్దానికి ఆయన సాహిత్యం ద్వారా సమాజానికి చేసిన సేవకు లభించిన గౌరవం ఇది. కవిత్వం వ్యక్తిగతం కాదని, సామూహికమని, సామాజికమని చెప్పిన ప్రపంచకవి, మహాకవి నెరూడాకు ఘననివాళి.

నెరూడా 20వ శతాబ్దంలో దాదాపు 3 వంతులు తన కవితల ద్వారా శ్రామిక జాతిని ఉత్తేజపరుస్తూ, పెట్టుబడి దారీ దేశాల ద్వంద్వ ప్రమాణాలను, దురాగతాలను ఎండగట్టారు. అందుకే గార్షియాగోర్కా **"నెరుడా కవిత్వం ఇంకు కన్నా రక్తానికి దగ్గర"** అన్నారు.

ప్రేమ కవిత్వాలతో ప్రారంభించి, సామాజిక కవిగా నెరూడా పరిణితి చెందారు. నెరూడా అంతర్వాణి, రాజకీయ నిబద్ధత, కవిత్వం ఒక్కటే కావడంతో ఆయన స్వరం స్వదేశమైన చిలీ స్వరమైంది. చిలీ అంతర్యుద్ధంలో అమెరికా కుతంత్రాలు, అలెండీ హత్య, యుఎస్ఎ ఘాతుకాలు, మిలటరీ పాలకుల దురాగతాలను నెరూడా కంఠం తుది వరకు ధిక్కరిస్తూనే ఉంది. నెరూడా చిలీకే కాకుండా అమెరికా ఖండానికి చెందిన సామాజిక కవి అయ్యారు. కవితలే కాకుండా ఆయన సాధారణ జీవితం, రాజకీయ నిబద్ధత ఎంతో మంది యువకులకు ఆదర్శ ప్రాయమైంది. చిలీ దేశానికి డిప్లొమేట్‌గా, రాజకీయ నాయకుడిగా ఎనలేని సేవలందించారు నెరూడా.

★ ★ ★

నెరూడా జూలై 12, 1904న దక్షిణ చిలీలో జన్మించారు. ఆయన తండ్రి రైల్వే కార్మికుడు. తల్లి ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయిని. సాధారణ కుటుంబంలో జన్మించిన నెరూడా తన తెలివి తేటలతో సమాజం పట్ల పూర్తి అవగాహనతో సాహిత్యంలో ఎంతో ఎత్తుకెదిగారు. ఆయన ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడు పికాసో పేరు నుండి పాబ్లోను, చెక్ ప్రఖ్యాత రచయిత నెరూడా పేర్లను కలిపి తన పేరును పాబ్లో నెరూడాగా మార్చుకున్నారు. సెప్టెంబర్ 23, 1973లో నెరూడా చనిపోయేంత వరకు కార్మికులతో పాటు ప్రజలందరినీ తన కవితలతో చైతన్య వంతులను చేశారు.

గని కార్మికులతోనూ, మార్కెట్‌యార్డు హమాలీలతోనూ, పని చేసుకునే పిల్లలతోనూ, శ్రామిక స్త్రీలతోనూ నెరూడా కలిసిపోయి వారిని చైతన్యవంతం చేసేవారు. ఒకరోజు నెరూడాని మార్కెట్‌లో పని చేసే హమాలీలు మాట్లాడ్డానికి పిలుస్తారు. ఏం మాట్లాడాలో తెలియక, నెరూడా కాస్సేపు నిశ్శబ్దంగా నించొని, స్పానిష్ యుద్ధంపై తను వ్రాసిన పద్యాలను, ప్రజల బాధలను దాదాపు 2గంటల పాటుచదివారు. చదవడం ఆపేసరికి హమాలీల కళ్ళనిండా నీళ్ళు. నెరూడా ఆ ఘటనను గుర్తు చేసుకొని, తన కవిత్వ పఠనాల్లో అది మకుటాయమానమైందంటారు. నెరూడాకి కవిత్వం ఒక సామాజిక చర్య. అదొక రాజకీయ చర్య.

1927లో భారత జాతీయోద్యమం ఉధృతంగా సాగుతున్న రోజుల్లో నెరూడా కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ సమావేశాల్లో పాల్గొన్నారు. గాంధీ, నెహ్రూలను కలిశారు. ఆయన "ఆసియా అంతటా రాజుకుంటున్న వలస పాలన వ్యతిరేక జ్వాలలు భారత్‌లోనే మొదలయ్యాయి. ఆసియాలో వలస పాలనకు చరమాంకానికి భారత్ శ్రీకారం చుడుతోందన్నా"రు. తరువాత 1951లో నెరూడా భారత దేశానికి శాంతి సందేశమివ్వడానికి వచ్చారు.

నెరూడా తన కవిత్వాన్ని 20వ ఏట "20 ప్రేమ గీతాలు, ఒక విషాద గేయం"తో ప్రారంభించి ప్రపంచంలోని తప్పులను నిర్భయంగా తన కవిత్వాల ద్వారా ఎత్తి చూపించే స్థాయికెదిగారు. ఆయన చిలీ పాలకులను విమర్శిస్తూ వ్రాసిన వ్యాసాలు అక్కడి పత్రికలు ముద్రించక పోయినా, వెనిజులా పత్రికలలో ముద్రితమయ్యాయి. నెరూడా రచించిన "రెసిడెన్స్ ఆన్ ఎర్త్", "స్పెయిన్ ఇన్ మై హార్ట్", "టు మై పార్టీ", "ఎలిమెంటరీ ఓడ్స్", "కాల్‌ఫర్ డిస్ట్రక్షన్ ఆఫ్ రిచర్డ్ నిక్సన్", "కాంటో జనరల్" ఎంతో ప్రఖ్యాతి గాంచాయి. ఆయన రచనలు ప్రపంచ వ్యాప్తంగా అనేక భాషలలో తర్జుమా అయ్యాయి.

మన దేశంలోనూ హిందీలో సాహిత్య అకాడమీ "పాబ్లో నెరూడా: కవితా సంచయిన్" పేరిట పుస్తకాన్ని ముద్రించింది.

నెరూడా కేవలం కవిత్వానికే పరిమితం కాకుండా తన స్వదేశమైన చిలీకి ఎనలేని సేవలందించారు. చిలీ దేశానికి కన్సులర్‌గా తూర్పు ఆసియా, అర్జెంటీనా, రంగూన్, కొలంబో, ఒటావియా, జావా, సింగపూర్‌లలో సేవలందించారు. డిప్లొమేట్‌గా స్పెయిన్‌కు, చిలీ అంబాసిడర్‌గా ఫ్రాన్స్‌లోనూ పని చేసారు. స్పెయిన్‌లో ఉండగా నెరూడా 2000 మంది వామపక్ష శరణార్థులను ఫాసిస్టుల బారి నుండి తప్పించి సురక్షితంగా చిలీ దేశానికి చేర్చారు. 1945లో సెనేటర్‌గా ఉంటూ పాలకుల దురాగతాలపై నిర్భయంగా ప్రసంగం చేశారు. ఆ సంవత్సరంలోనే ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1948లో ఏడాది పాటు నెరూడా అజ్ఞాతవాసం గడిపారు. 1970లో చిలీ అధ్యక్ష స్థానానికి నెరూడా కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థి అయినా తన స్నేహితుడైన అలెండీ కోసం తప్పుకున్నారు. 1972లో చిలీలో అలెండీ ప్రభుత్వాన్ని అమెరికా మిలటరీతో కూల్చించినప్పుడు మిలటరీ పాలకులు నెరూడా ఇంటిపై కూడా దాడి చేశారు. నెరూడా చనిపోయిన 2 రోజుల తర్వాత ఆయన శవాన్ని మిలటరీ పాలకులే ఖననం చేశారు. అప్పుడు మిలటరీ నియంతృత్వ పాలనకు వ్యతిరేకంగా ప్రజలు పెద్దయెత్తున ప్రదర్శనలు నిర్వహించారు.

పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద పాదాల క్రింద నలిగిపోయిన శ్రామిక జాతి నెరూడా కవితల్లో తనను తాను చూసుకొని ఆత్మ విశ్వాసంతో తన భవిష్యత్ చరిత్ర రాసు కోవడానికి సిద్ధమవుతోంది. దీనికి నిదర్శనమే నేడు ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాల్లో జరుగుతున్న పోరాటాలు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రపంచ వ్యాప్తంగా నిరసనలు వెల్లువెత్తుతున్నాయి. నెరూడా మరణించినా ఆయన గొంతు, కవిత్వం మనతోనే ఎల్లప్పుడు ఉంటూ మనల్ని ముందుకు నడిపిస్తుంది.

■ ఎ.వి.నాగేశ్వరరావు




# వెనుజులాలో అద్భుత విజయం






లాటిన్ అమెరికాలో చిన్న దేశం వెనుజులా. 2004 ఆగస్టు 15న దేశాధ్యక్షుడు చావేజ్ పై ప్రజాభిప్రాయం కోసం ఓటింగ్ జరిగింది. 58శాతం ఓట్లతో తిరుగులేని ఆధిక్యతను అక్కడి ప్రజలు అధ్యక్షునికి కట్టబెట్టారు. ఈ ఫలితాలు ఛావేజ్‌కు గొప్ప గుర్తింపు తెచ్చాయి. ఆ దేశానికి ప్రతిష్ట ఇనుమడించింది.

1998 ఎన్నికలలో చావేజ్ 38 లక్షల ఓట్లతో అధ్యక్షుడిగా మొదటిసారి, 2000లో రెండవసారి ఎన్నికయ్యారు. ఆయన వామపక్షవాది. ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటంలో పేదల, కార్మికవర్గ నాయకునిగా ఎదిగారు.

★ ★ ★

ప్రపంచ చమురు ఉత్పత్తిలో వెనుజులా 5వ స్థానంలో ఉంది. అమెరికా తన చమురు అవసరాల్లో 15 శాతం ఇక్కడి నుండే దిగుమతి చేసుకుంటున్నది. ప్రైవేటీకరణ పేర ఈ దేశపు ఆయిల్ రంగాన్ని కబళించే కుట్రలు పన్నింది.

చావేజ్, ఆయన పార్టీ ఇందుకు వ్యతిరేకం. ప్రభుత్వరంగంలోని చమురు కంపెనీల ద్వారా వచ్చే లాభాలను అక్కడి పేదల అభ్యున్నతికి ఆయన ప్రభుత్వం వినియోగిస్తున్నది. పేదలకు అనుకూలమైన సంస్కరణలకు శ్రీకారం చుట్టింది. 55 లక్షల హెక్టార్ల భూమిని పేదలకు పంచింది. మొదటిసారిగా బడ్జెట్‌లో 8 శాతం పేద పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యం, గుడిసె వాసులకు ఆరోగ్య సౌకర్యాలకు కేటాయించారు. గ్రామీణ, పట్టణ పేదలకు చౌకగా బ్యాంకు రుణాలు అందించింది. ఇలాంటి చర్యలన్నీ చావేజ్ పార్టీని ప్రజలకు సన్నిహితం చేశాయి.

★ ★ ★

అమెరికా ఆధిపత్యానికి భారత్ వంటి దేశాల పాలకులు లొంగి పోతున్న తరుణమిది. లాటిన్ అమెరికా పరిణామాలు అమెరికన్ పాలకులకు దడ పుట్టిస్తున్నాయి. ఆ ప్రాంత దేశాలన్నీ ఇటీవలి వరకూ అమెరికా తొత్తు పాలన క్రింద బానిస బతుకులనీడ్చాయి. ఈ ప్రాంతం ప్రపంచ బ్యాంకు తొలి ప్రయోగశాలగా మారింది. వెనుజులాతో పాటు బ్రెజిల్, ఈక్వెడార్, పెరూలలో వామపక్ష ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. 5 దశాబ్దాలుగా 'సోషలిస్టు క్యూబా' అమెరికా పాలకుల దుర్మార్గాలను ప్రతిఘటిస్తూ వేగుచుక్కలా నిలిచింది. ఇప్పుడు దానికి అండగా పై 4 దేశాలలో ప్రపంచీకరణ వ్యతిరేక శక్తులు అధికారం లోకి వచ్చాయి. ఆ దేశాల మధ్య పెరుగుతున్న సఖ్యత, ఐక్యత అమెరికా వెన్నులో చలి పుట్టిస్తున్నది. అందుకే వెనుజులాలో చావేజ్ ప్రభుత్వాన్ని కూల్చేందుకు అమెరికా పలు కుట్రలు పన్నుతున్నారు.

★ ★ ★

ఆ దేశపు పెట్టుబడిదార్లు, భూస్వాములూ, చర్చిలోని కొన్ని విభాగాలూ, తొత్తు కార్మిక సంఘాలూ అమెరికాకు తొత్తులుగా పని చేస్తున్నారు. చావేజ్‌ను కొందరు సైనికాధికార్లు 2002లో కుట్ర చేసి నిర్బంధించారు. ఇది జరిగిన 24 గంటల్లో లక్షలాది మంది ప్రజలు వీధుల్లోకి వచ్చి సైనిక కుట్రను భగ్నం చేశారు. చావేజ్‌ను తిరిగి అధ్యక్ష పీఠంపై ప్రతిష్ఠించారు. చమురు కంపెనీలలో 2 నెల్లు సమ్మెలు చేయించటం ద్వారా వెనుజులా ఆర్థిక వ్యవస్థలో చిచ్చుపెట్టే యత్నం చేశారు.

అందులో భాగమే ఆగస్టు 15 రిఫరెండం. ఇందులో చావేజ్ ఓటమి ఖాయమని కుట్రదారులు పెద్ద ఎత్తున ప్రచారం చేశారు. ప్రజల నిర్ణయాన్ని వారి ప్రచారాలు ప్రభావితం చేయలేక పోయాయి. 2000లో 38 లక్షల ఓట్లు రాగా, రిఫరెండంలో 49.91 లక్షల ఓట్లతో చావేజ్ ప్రభుత్వం నిలదొక్కు కుంది. రిఫరెండం ఫలితాలపై చావేజ్ వ్యాఖ్యానిస్తూ "ఈ విజయం బుష్ , వైట్ హౌస్ కుట్రలపై వెనుజులా ప్రజల విజయం" గా అభివర్ణించారు. తమ దేశ స్వేచ్ఛ, సార్వభౌమత్వాలలో అమెరికన్ జోక్యానికి స్థానం లేదన్న సంకేతాన్ని వెనుజులా ప్రజలిచ్చారు. ■

### సామాజిక న్యాయ పరిరక్షణకు

# ప్రైవేటు రంగంలో కూడా రిజర్వేన్లు ఉండాలి

**"ఈ యుగంలో ప్రభుత్వంలో, ప్రభుత్వరంగ సంస్థల్లోనే కాకుండా, ప్రభుత్వ నిధులతో, సౌకార్యలతో ప్రయోజనాలు పొందే ప్రైవేటు కార్పోరేషన్లలో, వాణిజ్యంలో సహితం తమకు రిజర్వేషన్లు కావాలని ఇటీవల దళిత, అదివాసి మేధావులు, కార్యకర్తలు కోరుతున్నారు. ప్రస్తుత ఆర్థిక వ్యవస్థలోను, భవిష్యత్తు లోను ప్రైవేటు రంగం సామూహిక విధానాలు అవలంబించడం ఆవశ్యం. సమాజం నిరాక రించిన ఈ వర్గాల అభ్యున్నతికి, అసమానత లు తొలగించేందుకు, ప్రగతిశీలమైన సామాజిక విధానాలు వారు అవలంబించాలి. ఇది ప్రైవేటు యాజమాన్యాలను సామ్యవాదం అంగీకరించమని కోరడం కాదు. కానీ, అమెరికా లాంటి పెట్టుబడి దేశంలో "వైవిధ్య బిల్లు, నిశ్చయాత్మక చర్యలు రూపొందించి అమలు పరచిన రీతిలో కొంత ప్రయత్నం చేయాలి."**

– 2002 జనవరి 26న అప్పటి రాష్ట్రపతి కెఆర్ నారాయణన్ చేసిన గణతంత్ర దినోత్సవ ప్రసంగం

---

ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్ పై అన్ని రాజకీయ పార్టీలు నేడు సానుకూలంగానే మాట్లాడుతున్నాయి. బి.జె.పి మాత్రం వ్యూహా త్మకంగా వూగిసలాటను కనబరుస్తున్నది. అదే బి.జె.పి అగ్రకులాలకు రిజర్వేషన్ డిమాండు కు వెంటనే ఆమోదం తెలిపింది.

ఉభయ సభలనూ ఉద్దేశించి రాష్ట్రపతి కలాం చేసిన ప్రసంగంలో ప్రైవేట్ రంగంలో ఎస్సీ, ఎస్టీలకు రిజర్వేషన్ కల్పించే అంశాన్ని సానుకూలంగా పరిశీస్తున్నట్లు తెలిపారు. మాజీరాష్ట్రపతి కె.ఆర్ నారాయణన్ కూడా ప్రైవేటు రంగంలో ఎస్సీ, ఎస్టీలకు రిజర్వేషన్ గురించి మాట్లాడారు. నేటి యు.పి.ఎ. ప్రభుత్వం తన కనీస ఉమ్మడి కార్యక్రమంలో (సి.యం.పి) దీన్ని చేర్చింది. మహారాష్ట్ర ప్రభుత్వం అనేక పరిమితులతో నైనా ఒక చట్టాన్ని తెచ్చింది.

పార్లమెంటులో సి.పి.ఎం సభ్యుడు ఎన్.అజయ్‌కుమార్ దీనిపై ప్రైవేటు తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు.

రాజకీయ రంగం కన్నా మిన్నగా మేధోరంగం కూడా ఈ అంశంపై చర్చిస్తోం ది. ఎస్సీ, ఎస్టీల సంక్షేమ పథకాలో భాగంగా మాత్రమే ప్రైవేట్‌రంగంలో రిజర్వేషన్ సమస్యను చర్చిస్తున్నట్లు కన్పిస్తున్నది. ఇది సంపన్న పెట్టుబడిదారీ వర్గానికి, నయా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే ప్రజాతంత్ర ఉద్యమమే.

ప్రైవేట్ రంగం పట్ల ప్రభుత్వం శ్రద్ధ చూపడం, మార్కెట్ ఆర్థిక వ్యవస్థ గత దశాబ్దంగా వృద్ధి చెందటంతో సామాజిక న్యాయం ఒక సమస్యగా ముందుకొచ్చింది.

కనీస హక్కులు నోచుకోని నల్ల జాతీయులు 1950-60 మధ్య కాలంలో అమెరికాలో చేసిన పోరాటాన్ని అంతర్యుద్ధం గా పరిగణించారు. పౌర హక్కుల ఉద్యమం వల్ల "అఫర్మిటివ్ యాక్షన్ ప్రోగ్రామ్" అనే దాన్ని అమెరికా ప్రభుత్వం తెచ్చింది. దీని ప్రకారం అన్ని ప్రైవేటు సంస్థలు తమ ఉద్యగ నియామకాలో జాతి వివక్షను ప్రదర్శించరాదు. వివక్ష పాటించిన కార్పొరేట్ సంస్థలపై చట్ట పరమైన చర్య తీసుకోబడుతుంది. ఇప్పటికే వీటికి సంబంధించిన వలు కేసులు అమెరికన్ అత్యున్నత న్యాయస్థానం ముందు విచారణలో ఉన్నాయి. దక్షిణాఫ్రికాలో సైన్యం లో సైతం రిజర్వేషన్‌లను అమలు చేస్తున్నారు. మలేషియా కూడా "అఫర్మిటివ్ ప్రోగామ్"ను అమలు చేస్తోంది.

మన దేశంలో ప్రపంచీకరణను ఆహ్వా నించే సంపన్నవర్గం ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లను వ్యతిరేకిస్తున్నది.

మహారాష్ట్రలో "మహారాష్ట్ర పబ్లిక్ సర్వీసెస్ యాక్ట్ 2004" పేరుతో ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లను అమలు చేస్తూ చట్టం చేశారు. దీనికి మన రాజ్యాంగంలోనే ఆర్టికల్ 348 క్లాస్ (3) ను ఆధారంగా చూపారు. ఈ చట్టాన్ననుసరించి ఏ ప్రభుత్వ రంగ సంస్థలైతే ప్రభుత్వం నుండి భూమిని గానీ, నిధులు గానీ పొందితే ప్రభుత్వరంగ సంస్థల వలే రిజర్వేషన్లు అమలు చేయాలి. అమలు చేయ నిరాకరించిన యాజమాన్యానికి 90 రోజులు జైలు శిక్ష, 5 వేల రూపాయల జరిమానా లేదా రెండింటిని విధించవచ్చు. సహజంగానే ఇది మహారాష్ట్ర పారిశ్రామిక వర్గాల్లో అలజడిని రేపింది. పారిశ్రామిక వేత్తలు ఇప్పటికే రాష్ట్ర ముఖ్య మంత్రి ఏ.పి.షిండే ని కలసి చట్టాన్ని నిర్వీర్యం పరచాలని కుట్రలు కొనసాగుతూనే ఉన్నాయి.

**ప్రైవేటు రంగం దబ్బంతా ప్రజలదే**

దేశంలోని మొత్తం పరిశ్రమల్లో 29 శాతం మాత్రమే ప్రభుత్వరంగ పరిశ్రమలు. 71శాతం ప్రయివేటు రంగ పరిశ్రమలే. ప్రభుత్వరంగంలోని పెట్టుబడులు లాగానే, ప్రైవేట్ రంగంలోని పరిశ్రమలకు పెట్టే పెట్టుబడుల్లో 90శాతం ప్రభుత్వ బ్యాంకుల నుండి, ప్రభుత్వ సంస్థల నుండి తీసుకొన్నవే. ప్రైవేటు యజమాన్యం సొంత పెట్టుబడులు 10శాతం మించ వంటే అతిశ యోక్తి కాదు. ఉదాహరణకు ఈ క్రింద పేర్కొ న్న కొన్ని ప్రయివేటు సంస్థలను పరిశీలిద్దాం.

| ప్రమోటర్ | ప్రైవేటు పెట్టుబడి | ప్రభుత్వం ద్వారా |
|---|---|---|
| 1. ఎన్ఎఫ్‌సిఎల్ | 9.9% | 90.1% |
| 2. పద్మినిటెక్ | 9.5% | 90.5% |
| 3. సూర్యరోష్ని | 9.2% | 90.8% |
| 4. డిఎస్ఆర్‌సాఫ్ట్‌వేర్ | 1.7% | 98.3% |
| 5. ఫెంటా మీడియా గ్రాఫిక్స్ | 2.5% | 97.5% |
| 6. మార్స్ సాఫ్ట్‌వేర్ | 1.9% | 98.1% |
| 7. ఎస్ఆర్‌జి ఇన్ఫోటెక్ | 0.2% | 99.8% |
| 8. సౌత్ ఇండియన్ బ్యాంక్ | 5.0% | 95% |
| 9. యునైటెడ్ వెస్టర్న్ బ్యాంక్ | 0.3% | 99.7% |
| 10. లక్ష్మి విలాస్ బ్యాంక్ | 1.7% | 98.7% |

మూల ధనం ప్రోగుపడటానికైనా, ఉత్పత్తికైనా, మారకానికైనా, పునరుత్పత్తికైనా, లాభాల మీద లాభాల పెంపుకైనా, అనేకుల సమిష్టి కృషి ద్వారానే సాధ్యం. ఇతరులతో సంబంధం లేని ప్రైవేటు పెట్టుబడి అంటూ ఏమి ఉండదు. అది ఏదయినా వుందంటే అది దోపిడిదార్లకు చట్టం కల్పించిన సౌకర్యం మాత్రమే. అలాంటి ప్రైవేటు ఆస్తులలో సహితం యజమాన్యం వెచ్చించేది అతి స్వల్పమనేది పై లెక్కలు తెలుపుతున్నాయి. అందుకే ప్రైవేటు రంగంలో రిజర్వేషన్స్ కోరడం అత్యాశ కాదు. అన్యాయం కాదనేది ఏ కోణం నుండి చూసినా అర్థమవుతుంది.

**■ జి.రాములు**
సిఐటియు రాష్ట్ర ఉపాధ్యక్షులు

కృష్ణా పుష్కరాల శుభాకాంక్షలతో ......

# శ్రీ షిర్డి సాయిబాబా దేవాలయం

## ఆటోనగర్ - గుంటూరు





విశ్వశాంతిని, లోక కళ్యాణమును ఆకాంక్షిస్తూ గుంటూరు ఆటోనగర్ సమీపములో వెయ్యి ఎకరాల సువిశాల విస్తీర్ణముతో అభివృద్ధి చెందుతున్న **"శ్రీ సుధాకర్ శాటిలైట్ మెగా టౌన్ షిప్స్"** నందు "జనచైతన్య హౌసింగ్ లిమిటెడ్" వారిచే దక్షిణ భారతదేశంలోనే అత్యంత సువిశాలమైన ప్రాంగణంలో నిర్మించబడిన దేవాలయము.

గుంటూరు జిల్లా అశేష భక్త జనంతో పాటు అనేక ఇతర ప్రాంతాల నుంచి వేలాది మంది భక్తులు సందర్శించే దేవాలయం ఇది. నిత్య పూజలతో ప్రముఖ పండుగ పర్వ దినాలలో ప్రత్యేక పూజలు అన్నదాన కార్యక్రమాలతో వేలాది మంది భక్తులు ఆలయంను దర్శించుకొని షిర్డి సాయినాధుని ఆశీస్సులను పొంది తరించుచున్నారు.

**భక్తుల కోర్కెలను తీర్చే దేవాలయముగా పేరు గాంచినది**




**మాదల సుధాకర్**
ఛైర్మన్ & మేనేజింగ్ డైరెక్టర్

**దేవాలయం తెరిచి ఉండే వేళలు :**

ఉ॥ 6 గం॥ల నుండి మ॥ 12 గం॥ల వరకు
సా॥ 4 గం॥ల నుండి రా॥ 8 గం॥ల వరకు



# జనచైతన్య ఆధ్యాత్మిక కేంద్ర
# జనచైతన్య హౌసింగ్ లిమిటెడ్

**5/1, అరండల్‌పేట, గుంటూరు. ఫోన్స్ : 2232634**

*With Best Compliments On the Occasion of Insurance Nationalisation Day.*

# LIC's BIMA PLUS

## (Capital Market Linked Insurance Plan)



***LIC's Bima Plus is a newscheme which provides life insurance cover, along with the prospect of high growth. Under this scheme, a portion of the premium is invested in equity and debt instruments in the capital market where scope for high growth exists. The extent of the money invested in these instruments depends upon the type of Fund you choose under scheme. LIC's Bima Plus gives you the option of three funds-Secured Fund, Balanced Fund and Risk Fund. Within the term of the policy you can also switch from one Fund to another. In this way the scheme provides a choice between the possibility of high returns* and relative security; along with the indispensable life Insurance cover.***




*Trust - thy name is LIC*

**Life Insurance Corporation of India**

**Nellore Division**

**(Insurance is the subject matter of solicitation)**

# జోహార్ జోహార్ ఓ వీరులారా!




▪ పి.ఎన్.మూర్తి

బషీరుబాగ్‌లో వీరుల జాడలు
విద్యుత్ పోరులో మిన్నెంటె శూరులు
రాజధానిలోన రక్తపు ధారలు
తెలుగింట విరిసిన త్యాగాలమూర్తులు
జోహారు జోహారు ఓ వీరులారా!
జేజేలు జేజేలు ఓ అమరులారా!!



విశ్వబాంకుకు మొక్కి ఊడిగం చేసి
జనుల రక్తము జుర్రి దోపిడోళ్ళను మేపి
కటిక చీకటిలోన తెలుగోళ్ళ నెట్టి
వెలుగు స్వర్గంలోన కులికేటివాళ్ళ
గుండెలదరగొట్టె ఎర్రజెండావాళ్ళు
పోరుజెండా లెత్తి పోరాడినోళ్ళు
జోహారు జోహారు ఓ వీరులారా!
జేజేలు జేజేలు ఓ అమరులారా!!

విద్యుత్ రంగాన్ని పణముగా పెట్టి
మట్టి మనుషుల పంట మట్టి కల్పినట్టి
పేద సాదల బతుకు గంగలో నెట్టి
వెలుగు స్వర్గంలోన కులికేటివాళ్ళ
గుండెలదరగొట్టె ఎర్రజెండావాళ్ళు
పోరుజెండా లెత్తి పోరాడినోళ్ళు
జోహారు జోహారు ఓ వీరులారా!
జేజేలు జేజేలు ఓ అమరులారా!!

ప్రైవేటు విద్యుత్ లాభాలు ఎంచి
కరెంటు చార్జీలు కసితీర పెంచి
అన్యాయమన్నోళ్ళ నోళ్ళనే నొక్కి
వెలుగు స్వర్గంలో కులికేటి వాళ్ళ
గుండెలదరగొట్టె ఎర్రజెండావాళ్ళు
పోరుజెండా లెత్తి పోరాడినోళ్ళు
జోహారు జోహారు ఓ వీరులారా!
జేజేలు జేజేలు ఓ అమరులారా!!

ఖాకీల లాఠీలు మట్టి కరిపించి
సర్కారు తూటాల తోళ్ళు వలిపించి
పోరుక్షేత్రంలో కొదమసింగాలై
ప్రజల కోసం వాళ్ళు ప్రాణాలు విడిచె
ఎర్రజెండా నీడ వాసి కెక్కినోళ్ళు
పాలపుంతలోన పొద్దు తారలువాళ్ళు
జోహారు జోహారు ఓ వీరులారా!
జేజేలు జేజేలు ఓ అమరులారా!!

వర్ధిల్లు రాష్ట్రాన మా విష్ణువర్ధన్
విరబూయు మదిలోన ఓ రామకృష్ణా
కదలాడు నీ రూపు మా బాలస్వామి
ముమ్మూర్తులా మీరు మా కంటి వెలుగు
ఎర్రజెండా నీడ వాసి కెక్కిన మీరు
పాలపుంతలోన పొద్దు తారలు మీరు
జోహారు జోహారు ఓ వీరులారా!
జేజేలు జేజేలు ఓ అమరులారా!!



31




# అనుచరులు బలిపశువులు కాదు- 'యజ్ఞం'

హింస పడగ విప్పిన చోట ప్రజలు ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని బ్రతకాలి. ఆ హింస యుద్ధోన్మాదానిది కావచ్చు, మతోన్మాదానిది కావచ్చు, ఉగ్రవాదానిది కావచ్చు లేదా ఫ్యాక్షనిజం (ముఠాకక్షలు) దైనా కావచ్చు.

ఫ్యాక్షనిజం నేటికీ పలు చోట్ల ప్రజలను నీడలా వెంటాడుతూనే ఉంది. రాయలసీమ అంటే కరువే కాదు ఫ్యాక్షనిజం కూడా అనే నానుడి చలామణి అవుతున్నది. "నాది భారత దేశంలో కల్లా అగ్రగామి హైటెక్ ప్రభుత్వం. గొప్ప విజన్‌తో సంస్కరణలు అమలు జేస్తున్న పాలకుడ్ని నేను" అని విర్రవీగిన చంద్రబాబు నాయుడు కూడా ఈ ముఠాకక్షలను రూపుమాపలేకపోయాడు. పైగా ఆయన ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఈ ఫ్యాక్షన్ హత్యారాజకీయాలు నేపథ్యంగా సాగిన చలనచిత్ర వేడుకలకు హాజరై కథానాయకులను ప్రశంసించాడు కూడా. కడకు ఇప్పుడు ప్రతిపక్ష నాయకుడిగా అదే రాయలసీమ వెళ్ళి తన పార్టీవాళ్ళను రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ఒక పథకం ప్రకారం చంపుతున్నదంటూ (ఫ్యాక్షన్ మోడల్లో) ధర్నా కూడా చేసివచ్చారు.

పాలక పక్షమైనా, ప్రతిపక్షమైన నిస్వార్థపూరిత ప్రజానుకూల రాజకీయాలు అమలు పరిచినప్పుడు మాత్రమే ఇలాంటి హత్యాకాండకు అడ్డుకట్టవేయడం సాధ్యమవుతుంది. అలాగాక పైపై పటాటోప కార్యక్రమాలతో అణచాలనుకోవడం వట్టి భ్రమే అవుతుంది. అప్పటి వరకు ఆ ప్రాంత ప్రజలకు శాంతి ఉండదు. దగ్గర అనుచరులకు మాత్రం మృత్యఘంటికలు గుండెల్లో మ్రోగుతూనే ఉంటాయి.

ఇలాంటి ఫ్యాక్షనిజం అంశంపై ఈతరం పిక్చర్స్ వారు క్రొత్త కోణంతో ఆవిష్కరించిన చిత్రం 'యజ్ఞం'. భారీ బడ్జెట్‌తో బడా హీరోల చిత్రాలే బాక్సాఫీస్ వద్ద బొక్కబోర్లపడి బోల్తా కొడుతుంటే ఈ చిత్రం క్రమేణా అర్థశతదినోత్సవం దాటి శతదినోత్సవానికి పరుగులు పెడ్తున్నది. కారణం కథే! ఈ చిత్రానికి శ్రీను హీరో అయినప్పటికీ ఆ హీరోలో హీరో ఫ్యాక్షన్ నడిపే దొర కాదు. దొరకొడుకు అంతకన్న కాదు. ఆ ఫ్యాక్షనిజం అనుచరగణంలో పుట్టిన పాపానికి చిన్నప్పుడే తల్లిదండ్రులను పోగట్టుకుని నాయకునికి అత్యంత విశ్వాసంగా మిగిలిపోయిన ఓమామూలు నిర్భాగ్యుడు. అందుకే చిత్రం గ్రామీణ మాస్ యూత్‌ను ప్రత్యేకంగా ఆకర్షిస్తున్నది.

శ్రీను (గోపిచంద్) చిన్నప్పటి నుండి తన యజమాని రెడ్డప్పనే (దేవరాజ్) దేవుడిగా నమ్ముకుని ఉంటాడు. రెడ్డప్ప కూతురు శైలజ (సమీరబెనర్జీ) బాగోగులు చూసుకోవడమే తన లక్ష్యం. వేరే ఆలోచన, ధ్యాస ఉండదు. ఆ గ్రామంలో రెడ్డప్ప, నాయుడమ్మలు (విజయకుమార్) బద్ధ విరోధులు. ఇద్దరికి అనుచరగణం ఉంటుంది. ఒకరి మనుషుల్ని మరొకరు అమ్మోరికి మేక పోతుల్ని బలిచ్చినట్టు వేటకోడవళ్ళతో నరక్కుంటారు. అలా ఒకరిపై మరొకరు విద్వేషాన్ని రెచ్చగొడ్తుంటారు. కార్యకర్తలకు అవే కక్షలను, కార్పణ్యాలను నిరంతరం నూరిపోస్తుంటారు. అక్కడో మానవ మృగాల ఉత్పత్తి జరుగుతుంటుంది. బ్రతుకుతెరువుకై అందులో చిక్కుకున్న వాళ్ళు ఆ ఫ్యాక్షన్ ఊబి నుండి బయటపడడం అసాధ్యం.

తల్లితండ్రిని చంపిన నాయుడమ్మను చంపి పగతీర్చుకోమని రెడ్డప్ప శ్రీనును చిన్నప్పటి నుండే రెచ్చగొడ్తుంటాడు. ప్రతిగా శ్రీనును చంపడం నాయుడమ్మకు సాధ్యం కాదు. శ్రీను ప్రక్కన ఉన్నంతకాలం రెడ్డప్పను కూడా ఏమీ చేయలేమనే నిర్ణయానికి కూడా వస్తాడు నాయుడమ్మ. అందుకే శ్రీనును అంతమొందించడానికి రెడ్డప్పతో నాయుడమ్మ ఎగ్రిమెంట్‌కు వస్తాడు. శ్రీను ప్రేమించిన శైలజకు ఈ విషయం తెలుస్తుంది. బాంబుల గడ్డకు దూరంగా వీరిద్దరు కలుసుకుని ప్రకృతి అందాలు, ఆనందాలు అనుభవిన్నున్న తరుణంలో రెడ్డప్ప మనుషులు శ్రీనును దారుణంగా గాయపరచి శైలజను తీసుకుపోతారు. శైలజ స్నేహితురాలు ఫాతిమా సహాయంతో శ్రీను బ్రతికి బయటపడతాడు. శైలజ ఇంట్లో నుంచి తప్పించుకొని పోలీస్ స్టేషన్‌లో కంప్లైయింట్ ఇస్తుంది. అప్పటి వరకు ఎలాంటి కంప్లైయింట్ అందక కుంభకర్ణుడిలా నిద్రపోతున్న పోలీసు డిపార్ట్‌మెంట్ వెంటనే ఎలర్ట్ అవుతుంది. పోలీస్ ఆఫీసర్ ఎస్.ఐ.ప్రతాప్ (ప్రకాశ్‌రాజ్) రంగప్రవేశం చేస్తాడు. రాయలసీమ ఎలాంటి పవిత్ర క్షేత్రమో హితవు చెప్తాడు. పోలీసు విధులు నిర్వహిస్తాడు. ఈలోగా రెడ్డప్ప నాయుడమ్మల నిజస్వరూపాన్ని ఉభయ అనుచరగణం తెలుసుకుంటుంది. శ్రీను వెనుక నిలబడ్తుంది. చివరకు జనం అందరి సమక్షంలో ఫ్యాక్షనిజం నడిపే దుర్మార్గాన్ని బట్టబయలు చేసి, అనుచరగణం పాత్రను గ్లోరిఫై చేసి తనను చంపడానికి వచ్చిన రెడ్డప్ప, నాయుడమ్మలు ఒకర్నొకరు తలలు తెగనరుక్కోవడం తో చిత్రం సమాప్తమవుతుంది.

"నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటై ఆహుతిచ్చాను" అన్న శ్రీశ్రీ గీత పల్లవితో చిత్రం ఆరంభమవడం, అంతమవడం విశేషం. హింసాయజ్ఞంలో కడకు పావులై, సమిధిలైపోయేది పేదల బతుకు లేనని, ఆ పేదలే చైతన్యవంతులై హింసకు చరమగీతం పాడాలనే సందేశాన్ని ఇస్తుంది.

"నేటి భారతం", "రేపటి పౌరులు" వంటి సందేశాత్మక చిత్రాలు రూపొందించిన ఈతరం పిక్చర్ ఈ "యజ్ఞం"లో నాటి చిత్రాల మేటి దర్శకుడు కీ.శే.టి.కృష్ణ పుత్రుడు గోపిచంద్ ఈ చిత్ర కథానాయకుడుగా నటించడం ముదావహం. ఇప్పటి వరకు ప్రతి నాయకుడుగా నటించిన గోపిచంద్‌కు ఈ పాత్ర సరితూగింది. టి.వి.యాంకర్ జాహ్నవి ఫాతిమా పాత్ర, అలాగే ఝాన్సీ-కళ్ళముందే తన భర్తను చంపొద్దు అంటూ వేడుకునే పాత్ర చిత్రానికి ప్రత్యేకార్షణ. మరుదూరిరాజా మాటలు, అశోక్‌తేజా, సిరివెన్నెల సీతారామ శాస్త్రి పాటలు, మణిశర్మ సంగీతం, రమణరాజు ఫోటోగ్రాఫీలతో, చిత్ర దర్శకుడు ఎ.ఎస్.రవికుమార్ తన స్క్రీన్‌ప్లే ద్వారా ప్రేక్షకుల ఊహలకు భిన్నంగా పలుచోట్ల కథను నడిపిస్తాడు. మా "ఈతరం" సంస్థకు సినిమా పట్ల ఓ కమిట్‌మెంట్ ఉంటుందని చెప్పుకునే నిర్మాత పోకూరిబాబురావు, ఆ "ఈతరం" యూనిట్ ఈ చిత్ర కథను అందించింది.

■ శైలి

Printed & Published by Sri.M.A.Gafoor On behalf of CITU A.P. State Committe from N.V.B Smaraka Kendram, 1-1-1-60/4, Musheerabad, Hyderabad - 20, Type setting & Printing at Prajasakti Daily Printing Press, RTC'X' Roads, Hyderabad - 20. Editor Y. Siddaiah.

కృష్ణా పుష్కర శుభాకాంక్షలతో ......

# జిల్లా నీటి యాజమాన్య సంస్థ

## కర్నూలు

జిల్లా నీటి యాజమాన్య సంస్థ క్రింద గత 2003-2004 సం॥లో 193 నీటి నిల్వ పథకములు (వాటర్ షెడ్లు) అమలులో ఉన్నవి. గత సంవత్సరములో రూ. 1760.80 లక్షలు మంజూరైనది. లభ్యముగా ఉన్న నిధుల నుండి రూ. 1567.779 లక్షలు ఖర్చయినది. ప్రస్తుత 2004-2005 సం.లో 232 నీటి నిల్వ పథకములు (వాటర్ షెడ్లు) డి.పి.ఎ.పి. పథకము క్రింద అమలులో ఉన్నవి. ఈ నీటి నిల్వ పథకములు (వాటర్షెడ్లు) అమలుకు ప్రభుత్వము జూలై -2004 మాసాంతము వరకు నిధులు మంజూరు చేయలేదు. లభ్యముగా ఉన్న ప్రారంభ నిల్వ నుండి రూ.94.906 లక్షలు ఖర్చు చేయడమైనది.

**ఆర్.ఐ.డి.యఫ్. - VI :**

జిల్లాలో ఆర్.ఐ.డి.యఫ్., పథకము క్రింద రూ. 15.26 కోట్లతో 45 ప్రాజెక్టులు మంజూరై అమలు జరుగుచున్నవి. ఇంతవరకు 205 వాగు కమిటీలు, 824 వినియోగదారుల బృందాలు, 313 స్వయం సహాయక బృందాలు మరియు 43 గ్రామ ఐక్య సంఘాల ద్వారా ఈ పనులు జరుగుచున్నవి. గత 2003-2004 సం.లో ప్రభుత్వము రూ. 310.10 లక్షలు మంజూరు చేయగా ప్రారంభ నిల్వతో కలిపి లభ్యముగా ఉన్న నిధుల నుండి రూ. 319.63 లక్షలు ఖర్చు చేయడం జరిగింది. ఈ పథకము క్రింద 43 ప్రాజెక్టులలో పనులు పూర్తయినవి. పథక ప్రారంభము నుండి ఇంతవరకు రూ. 1197.86 లక్షలు మంజూరు కాగా వడ్డీతో కలిపి లభ్యముగా ఉన్న నిధుల నుండి రూ.1213.59 లక్షలు ఖర్చయినది.

**ఆర్.ఐ.డి.యఫ్. - VIII (IIవ విడత) :**

జిల్లాలో ఈ పథకము క్రింద 249 చెక్ డ్యాములు, 95 ఊటచెరువులు, 240 రాక్ ఫిల్ డ్యాములు, 41 ఊట చెరువు పనులు రూ.640.00 లక్షల అంచనాతో 24.994 లక్షల క్యూబిక్ మీటర్ల నీటి నిల్వ వాల్యూమ్ రూపొందించుటకు చేపట్టగా ఇందులో 02-08-2004 వరకు 645 పనులు రూ.566.00 లక్షల ఖర్చుతో పూర్తయినవి. తద్వారా 25.631 లక్షల క్యూబిక్ మీటర్ల నీటి నిల్వ ఘనపరిమాణము అదనంగా రూపొందించడమైనది.

**నీరు - మీరు :**

జిల్లాలో నీరు-మీరు కార్యక్రమము 01-04-2000 నుండి అమలు జరుగుచున్నది. ఇప్పటికి ఏడు విడతలు పూర్తయినవి. ఎనిమిదవ విడతలో 110.223 లక్షల క్యూబిక్ మీటర్ల నీటి నిల్వ ఘనపరిమాణము లక్ష్యము కాగా 02-08-2004 వరకు రూ.845.466 లక్షల ఖర్చుతో 94.616 లక్షల క్యూబిక్ మీటర్ల నీటి నిల్వ ఘనపరిమాణము అదనంగా సాధించడమైనది. ఈ కార్యక్రమము ప్రారంభమైనప్పటి నుండి అనగా 01-04-2000 నుండి 02-08-2004 వరకు రూ. 124.671 కోట్ల ఖర్చుతో 1112.700 లక్షల క్యూబిక్ మీటర్ల నీటి నిల్వ ఘనపరిమాణము అదనంగా పెంపొందించడమైనది.

**జల జీవని పథకము :**

జల జీవని పథకము ముఖ్య ఉద్దేశము వాటర్షెడ్ గ్రామాలలో నిరుపేదలకు దీర్ఘకాలిక మనుగడ గల జీవనోపాదుల ఆధారిత సహజవనరులను అభివృద్ధి చేయుటము. ఈ కార్యక్రమమునకు కావలసిన నిధులు బ్రిటిష్ గవర్నమెంటు, డి.యఫ్.ఐ.డి. ద్వారా రూ.50 కోట్ల రూపాయలను గ్రాంటుగా అందజేయబడుచున్నది. ఈ కార్యక్రమము 400 వాటర్ షెడ్లలో జీవనోపాదుల కొరకు మరియు 100 వాటర్షెడ్లలో సహజవనరుల అభివృద్ధి మరియు జీవనోపాదుల కొరకు అమలు జరుగుచున్నది. ఈ కార్యక్రమము 22 మండలాలలో, 265 గ్రామాలలో అమలులో వున్నది. 100 వాటర్షెడ్లలో సహజ వనరుల అభివృద్ధి కొరకు ఇప్పటివరకు రూ.304.781 లక్షలు ఖర్చు చేయడము జరిగినది. ఈ 265 గ్రామాలలో 25,098 నిరుపేదలను గుర్తించి సంఘటిత పరచడమైనది. వీరి జీవనోపాదుల కొరకు 209 &రగామ ఐక్య సంఘాలకు రూ. 728.526 లక్షల రూపాయల ద్రవ్య నిధి గ్రాంటుగా యివ్వటము జరిగినది. ఇప్పటివరకు 68 గ్రామాలలో జీవనోపాదుల కొరకు రూ.138.00 లక్షలు ఖర్చు చేయడము జరిగినది.

సెప్టెంబర్-2003 మాసములో నీటి నిల్వ (వాటర్ షెడ్) కార్యక్రమము అమలు వలన ఫలితాలను అంచనా వేయుటకు ప్రభుత్వేతర సంస్థలచే అంచనా వేయించినపుడు నీటి నిల్వ (వాటర్షెడ్) గ్రామాలలో ఈ క్రింది ఫలితాలు వెల్లడైనవి.

- 12725 ఎండిపోయిన బావులు పునరుద్దరింపబడినవి
- 55086 లీటర్ల పాల ఉత్పత్తి పెరిగినది
- 63302 ఎకరాల విస్తీర్ణము అదనంగా సాగైనది.
- 66365 ఎకరాలలో పండ్ల తోటల మరియు ఇతర తోటల విస్తీర్ణము పెరిగినది

**సూక్ష్మ సేద్యం :**

కర్నూలు జిల్లాలో ఆంధ్రప్రదేశ్ సూక్ష్మ సేద్యం పథకము క్రింద మన జిల్లాలో 22 మండలములలో ప్రభుత్వము వారు 16,925 హెక్టార్ల విస్తీర్ణములో రూ.57.77 కోట్ల వ్యయముతో 50% సబ్సిడి క్రింద ఉద్యానవన పంటలు, మల్బరీ తోటలు మరియు వ్యవసాయ పంటలకు 50 శాతం బ్యాంకు రుణ రూపేణా అమలు చేయుటకు మంజూరు చేయగా 23665 హెక్టార్లలో 13921 మంది రైతుల నుండి దరఖాస్తులు వచ్చినవి. మొదటి విడతగా 13206 హెక్టార్లలో 45.07 కోట్ల రూపాయాలతో 50 శాతం రాయితీతో అమలు చేయబడుతుంది. ఈ మొత్తము దరఖాస్తులు కంప్యూటర్ ద్వారా ఆన్లైన్లో పెట్టబడినవి. పైన తెలిపిన దరఖాస్తులను 75 బ్యాంకు మేనేజర్లకు రుణ మంజూరు కొరకు పంపబడినవి. బ్యాంకుల ద్వారా 50 శాతం రుణముతో ఇప్పటివరకు 3997 దరఖాస్తులు 6834 హెక్టార్లకు మరియు 50 శాతం రైతులు భాగస్వామ్యంతో 247 దరఖాస్తులు 372 హెక్టార్లకు మంజూరు చేయబడినది.




**యం.రామారావు, MA**
ప్రాజెక్టు డైరెక్టరు,
జిల్లా నీటి యాజమాన్య సంస్థ,
కర్నూలు



**ముఖేష్ కుమార్ మీనా, I.A.S.,**
జిల్లా కలెక్టరు / ఛైర్మన్ (అదనపు బాధ్యత)
జిల్లా నీటి యాజమాన్య సంస్థ,
కర్నూలు

కృష్ణా పుష్కరాల శుభాకాంక్షలతో ...

# కూకట్‌పల్లి పురపాలక సంఘం

**శ్రీ డా॥ వై.ఎస్.రాజశేఖర రెడ్డి**
రాష్ట్ర ముఖ్యమంత్రి

**శ్రీ కోనేరు రంగారావు**
మున్సిపల్ మినిస్టర్

**శ్రీ పి.జనార్ధన్ రెడ్డి**
శాసనసభ్యులు, ఖైరతాబాద్

**శ్రీ యం.శశిధర్ రెడ్డి**
శాసనసభ్యులు, సనత్‌నగర్

**శ్రీ సాయన్న**
శాసన సభ్యులు
సికింద్రాబాద్ కంటోన్మెంట్

**శ్రీ యం.అంజనకుమార్ యాదవ్**
మెంబర్ ఆఫ్ పార్లమెంట్
సికింద్రాబాద్

**శ్రీ.యన్.సత్యనారాయణ**
మెంబర్ ఆఫ్ పార్లమెంట్
సిద్ధిపేట

**శ్రీ జి.రాంచందర్**
చైర్‌పర్సన్
కూకట్‌పల్లి మున్సిపాలిటి

| | | |
|---|---|---|
| 1) నీటి సరఫరా పైపు లైనులు కొరకు (177) | - | రూ : 988.22 |
| 2) డ్రైనేజీ నిర్మాణం పనులు (401) | - | రూ : 658.20 |
| 3) రోడ్డు పనులు (500) | - | రూ : 1088.944 |
| 4) లైటింగ్ (151) | - | రూ : 223.27 |
| 5) ఎ.పి.యు.ఎస్.పి. స్కీము (33) | - | రూ : 440.01 (జరుగుచున్నది) |
| 6) ఇతరములు (373) | - | రూ : 1051.468 (కమ్యూనిటి హాళ్ళు, శ్మశాన వాటికలు, పార్కులు మరియు ఇతరములు |
| మొత్తం | | రూ : 4450. 112 చేపట్టుట జరిగినది. |

**శ్రీ ఎల్. వందన కుమార్**
కమీషనర్
కూకట్‌పల్లి పురపాలక సంఘం



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLV01A 368 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-8-2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Mounika |
| పేజీలు విడదీసినది | Mounika |
| స్కాన్ చేసినది | Nandhu |
| పరీక్ష చేసినది | Pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |